# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్లలో వుండాలి...



ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్ఫరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్ఫరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం

# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్ని వున్నాయి—ప్రొటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సిరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు

మీ పాపకి చనుపాలే తగినవి అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్®
## పాలు వుండనే వున్నాయి




సిరిలాక్ తయారు చేయడం ఎంతో సులభం దీనిని ముందుగా మరగ బెట్టిన, గోరు వెచ్చటి నీటికి చేర్చండి కలపండి వడ్డించండి

**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల చార్ట్
ఇందులో బరువు చార్టు రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి
సిరిలాక్
పోస్ట్ బాక్స్ నం 3 న్యూ ఢిల్లీ 110 008

SAA/FSL/C/3151 TEL

NESTLÉ.

## దుబాషీ మతోన్మాదా?

29 6 84 నాటి పత్రికలో దుబాషీ గారి వ్యాసం 'మతః కలహాలా? రాజకీయ హత్యలా?' పై 17 8 84 నాటి పత్రికలో శ్రీ జవహర్‌గారి విమర్శ గురించి-

హిందువులు అత్యధిక సంఖ్యలో నున్న మిగతా ప్రదేశాలలో అల్లర్లు జరుగ వెందుకు? కేవలం ఒక్క భివాండి, మురదాబాద్, హైదరాబాద్‌లలో నే ఎందుకు జరుగుతాయి? నిజానికి ఆలోచిస్తే ఈ కలహాలకు వీరిరువురూ వారిరువురూ కాదేమో అనిపిస్తుంది ఈ దేశంలో నెహ్రూ కాలం నుండి కూడా మతం పేరుతో, కులం పేరుతో ఒక వర్గం వారిని రెచ్చగొట్టి ఓట్లు సంపాదించుకోవడం రాజకీయ నాయకుల ఆచారం ఎప్పుడూ కాషాయ వస్త్రాలనే ధరించే శ్రీ ఎన్ టి రామారావు కేవలం ఒక్క ఆసిఫ్‌నగర్ నియోజకవర్గం ఎన్నికల్లో ముస్లిం వేషధారి కావడం అందరికీ తెలిసిన విషయమే ఈ దేశం కోసం, అణగారిపోయిన హిందూ సామ్రాజ్యాన్ని (హిందూస్థాన్, భారత్ ఒక్కటే) పునర్ నిర్మితం చేసినవాడు శివాజీ అలాంటి వ్యక్తి జన్మ దిన వేడుకలు జరుపుకోవడమే మతోన్మాదమా? భారత దేశంలో శివాజీలాంటి మహా విప్లవ వీరుడు జన్మించి ఉండకపోతే ఈ దేశ చరిత్రనే భిన్నంగా ఉండేది అని విదేశీ చరిత్ర కారులు వ్రాశారు తల్లి, చెల్లి మాన ప్రాణాలను కాపాడిన వాని జయంతులు జరపడమా? లేక వాటిని దోచుకున్న ఔరంగజేబు వేడుకలు జరపడమో పాఠకులే నిర్ణయించాలి బహుశః జవహర్ గారికి పంజాబ్ కల్లోలం ఎలా ప్రారంభం అయ్యిందో తెలియనట్లుంది అది జయ దుబాషీ గారి లాంటి వ్యాసాలవల్ల ప్రారంభం కాలేదని, ఇందిరా గాంధీ, జైల్ సింగ్‌ల పరోక్ష నాటకమని ఏమాత్రం పేపరు (ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ఇల్లస్ట్రేటడ్ వీక్లీ ఆఫ్ ఇండియా) చదివిన వారికైనా తెలుస్తుంది భారతీయ ధర్మంలో నే 'సర్వ మత సమ భావన' ఉన్నది ఈ దేశాన్ని ఏ దారుల్ ఇస్లాం గానో మార్చాలని చూస్తున్న భివాండి, పంజాబ్ హింసా కాండలు సమర్థనీయమైనవికావు ఈనాటికీ ఈ దేశంలో ప్రజాస్వామ్యం, పత్రికా విలువలు రక్షింపబడుతున్నాయంటే అది దుబాషీగారి లాంటి ఉత్తమ రచయితల వల్లనే గాని, ఏ రాజకీయ నాయకుడి వల్లనో గాదు

మాడుగుల జయదేవ్, వికారాబాద్

## కవిత

28-9-84 తేదీ సచిత్ర వార పత్రికలో ప్రచురించిన శ్రీ కల్లూరి సత్యరామ ప్రసాద్'సంపాదించు'గేయం, జిజ్ఞాసను, ఆశక్తిని కలిగిస్తోంది

కొండేటి బాబూరావు, కొండపల్లి

## గమనిక

సకాలానికి అందని కారణంగా ఈ వారం న్యూఢిల్లీ లేఖ వెయ్యలేకపోతున్నాము

–సం




## ఎలా సాధ్యం?

12-10-84న ఆంధ్ర సచిత్రవారపత్రికలో శ్రీ గంటి రామలింగంగారు మద్రాసు నుంచి వ్రాస్తు 1983 అసెంబ్లీ ఎన్నికలలో 190 లక్షల మంది ఓటు వేయగా తెలుగుదేశానికి 90 లక్షల ఓట్లు మాత్రమే వచ్చాయి అని అంటూ వ్రాశారు ఇది ఎలా సాధ్యం? తెలుగుదేశం పార్టీ అభ్యర్థులు 294 సీట్లకి 201 సీట్లు గెలుపొందారు అంతే కాదు ప్రతి ఒక్క తమ ప్రత్యర్థులపై 25వేల నుంచి 50వేల వరకు మెజారిటీ ఓట్లతో గెలుపొందారు అప్పట్లో ఒక దినపత్రికలో పోలైన ఓట్లలో సగానికిపైగా తెలుగుదేశానిదే అంటూ ప్రచురించినది అది నేను చదివితిని మరి రామలింగంగారు అన్నట్లు తెలుగు దేశానికి 90 లక్షల ఓట్లు ఎలా వస్తాయి? దానికంటే ఎక్కువే రావచ్చు

–ఎం శివప్రసాద్, విజయవాడ

## శ్రీ తరిమెల నాగిరెడ్డి జీవిత చరిత్ర

శ్రీ తరిమెల నాగిరెడ్డిగారు కమ్యూనిస్టు విప్లవ కారుల అగ్ర నాయకుడు శాసన సభా ప్రతి పక్ష నాయకునిగా, పార్లమెంటు సభ్యునిగా అసమానమైన ప్రతిభా పాటవాలను ప్రదర్శించిన ప్రముఖ పార్లమెంటేరియన్ కొన్ని దశాబ్దాల మన రాష్ట్ర చరిత్ర ముఖ్యంగా మన రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర, ఆయన జీవితంలో పెనవేసుకొనిపోయి వుంది 1976 జులై 28 న అత్యవసర పరిస్థితి కాలంలో ఆయన చనిపోయారు

ఆ మహనీయుని జీవిత చరిత్రను తీసుకు రావాలనే సంకల్పంతో చాలా విషయాలు సేకరించి, ఆయన పాత మిత్రులు కొందరిని ఇంటర్వ్యూ చేసి కొన్ని విషయాలు సేకరించాము తరిమెల నాగిరెడ్డిగారితో పరిచయముండి, ఆయనతో కల్సి పని చేసిన మిత్రు లెవరైనా ఆయన జ్ఞాపకాలను, అనుభవాలను, జీవిత చరిత్ర రచన కుపయోగపడే యే విధమైన సమాచారం గాని ఫోటోలు గాని తమ దగ్గరుంటే ఈ క్రింది చిరునామాకు పంప ప్రార్థన పంపిన సమాచారంగాని, ఫోటోలు గాని కోరిన పక్షంలో భద్రంగా తిరిగి వాపసు చేయగలను

చెరుకూరి సత్యనారాయణ, అడ్వకేట్, 82-3-22,
నాయుడు షెడ్ దగ్గర,
విజయవాడ రోడ్,
గుంటూరు–522001


**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభు ప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

శుక్రవారం 16-11-84
శ్రీ రక్తాక్షినామ సం కార్తీక బ అష్టమి

సంపుటము 77 : సంచిక 11

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2-00 |
| ఆరు మాసాల చందా | రు 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ-520 003


విషయానుక్రమణిక

ముఖచిత్రం
నటి 'అనూరాధ'
(ఫోటో కె ఆర్ వి భక్త)

కథలు :



సీరియల్ నవలలు :



వ్యాసాలు, శీర్షికలు :



# కొత్త ప్రధాన మంత్రి

శ్రీ రాజీవ్‌గాంధీ చాలా తేలికగా భారతదేశం యొక్క ప్రదాన మంత్రి పదవికి ఎన్నిక అయ్యారు ఆయన తల్లి శ్రీమతి ఇందిరా గాంధీ గట్టిగా పోటీ చేసిగాని ఈ పదవిని అలంకరించలేకపోయారు ప్రధాన మంత్రి అయినప్పుడు ఆమె వయసు సుమారుగా నలభయి తొమ్మిది శ్రీ రాజీవ్ గాంధీకి నలభయి ఏళ్ళు మాత్రమే ఇంత చిన్న వయసులో ప్రదానమంత్రి కాగలిగిన వారు ఎంపరో ఉంతరు లోక్ సభలో కాంగ్రెసు (ఐ) పార్టీ వారిక మంచి మెజారిటీ ఉంది ఆ రాజకీయ పక్షంలో శ్రీమతి ఇందిరా గాంధీకి చెప్పలేనంత పలుకుబడి అధి-కారమూ ఉండేది కాంగ్రెసు (ఐ)లో ఆమె తప్ప ఇంకెవరికీ జనసామాన్యంలో చెప్పుకోతగిన పేరు ఉండేది కాదు త్వరలో ఎన్నికలు రాబోతున్నాయి కాబట్టి ఈ తరుణంలో కీచులాటలు ఏవీ లేకుండా తమ ఏకైక నాయకురాలయిన శ్రీమతి ఇందిరా గాంధీ కుమారుడు శ్రీ రాజీవ్ గాంధీని ప్రదాన మంత్రి చేస్తే అన్ని విదాలుగానూ తమక శ్రేయస్కరంగా ఉంటుం-దని కాంగ్రెసు (ఐ) పార్టీవారు అనుకోవటం సహజం రాష్ట్రపతి జ్ఞానీ జెయిల్‌సింగ్ కూడా కాంగ్రెసు (ఐ)క చెందిన వారే ఆయన పంజాబు ముఖ్యమంత్రిగా కేంద్ర ప్రభుత్వంలో వేశీయాంగ మంత్రిగా ఉన్నవారే నేటి పరిస్థితులు చాలా వరకు పంజాబు సంక్షోభం ఫలితంగా ఏర్పడనవే అందువేత కొత్త ప్రదాన మంత్రికి ఆయన సలహా సహకారం ఎంతయినా అవసరం శ్రీమతి ఇందిరా గాంధీ దారుణ హత్య దేశంలో వారందరినీ దుఃఖంలో ముంచి వేసంది వారి సానుభూతి శ్రీ రాజీవ్‌గాంధీ తప్పకుండా లబిస్తుంది ఆయన తమ పదవిక న్యాయం చేకూర్చగలరని ఆశించాలి అయితే అయనక

రాజకీయలలో అనుభవం చాలా తక్కువ శ్రీమతి ఇందిరా గాంధీ తమ అధికారాన్ని నిలబెట్టుకోటంలో మంచి చాతుర్యం చూపించేవారు కాని ఆమె అనుస-రించిన పద్ధతులు కాని విదానాలు కాని ఆమె కుమారుడు అనుసరించి నెగ్గుకు రాగలరని అని-పించదు శ్రీ రాజీవ్ గాందీకి తమ పార్టీలో వారి బాసట అవసరం అంతే కాదు ఆయనకి కాంగ్రెసు (ఐ) పార్టీకి చెందిన వారి సలహా సహకారం సయితం అవసరమే ఇవి శ్రీ రాజీవ్ గాందీకి పుష్కలంగా లబించగలవని ఆశించాలి అవి లబించటానికి ఆయన తగిన ప్రయ-త్నాలు చెయ్యాలి శ్రీ మొరార్జీ దేశాయి శ్రీ చరణ్-సింగ్ శ్రీ జగ్‌జీవన్‌రామ్ వంటి నాయకుల సహకారం ఆయన కోరటంలో తప్పు ఏమీ ఉండదు ఎన్నికల ద్వారా అదికారంలోకి రాలేని రాజకీయ పక్షాలు కొన్ని ఉంటాయి వాటి నాయకుల సహకారం కూడా ఆయనకి లబిస్తే బాగా ఉంటుంది నేరుగా రాజకీయాలతో సంబంధం లేని మేదావులు కొందరు ఉంటారు కీ శే దేశ్‌ముఖ్ వంటి వారు దేశంలో ఇంకా కొందరు ఉంటారు వారి సలహా కొత్త ప్రదాన మంత్రికి ఉంటే మంచిదే ప్రస్తుతానికి ఆయన వేద పండో పాయాలకి దూరంగా ఉండటానికి ప్రయత్నిం-చాలి మొత్తం మీద శ్రీ రాజీవ్‌గాంధీ అందరినీ కలిసి కట్టుకు రావాలి కాని ఎవరినీ దూరం చేసుకోరాదు ఇంత వైవిద్యం కల బారత దేశంలో వివిద వర్గాల వారి మధ్య సహ జీవనాన్ని పెంపొందించి, బలహీన వర్గాలుగా పిలువబడే వారి స్థితి మెరుగు పరచటానికి ఆయన కృషి చెయ్యాలి □

# స్వర్గీయ
# శ్రీమతి ఇందిరా ప్రియదర్శిని గాంధీ
# జీవితంలో కొన్ని ఘట్టాలు


ఇటీవల మధ్యప్రదేశ్‌లో హరిజన సమ్మేళనంలో ప్రసంగిస్తున్నప్పుడు


జాతిపితతో ఇందిరాప్రియదర్శిని


రచయిత్రులతో శ్రీమతి గాంధీ


నోబెల్ బహుమతి గ్రహీత డా. అహ్మద్ అబ్దుస్ సలామ్‌తో శ్రీమతి గాంధీ


ఆశియా క్రీడా జ్యోతిని వెలిగిస్తున్న శ్రీమతి గాంధీ



బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్‌తో



సత్కార్యాచరణకి విరాళం ఇస్తున్న
శ్రీమతి గాంధీ



భారత దేశం వచ్చిన వియత్నాం సంగీత నృత్య కళాకారుల
బృందంతో



పారిస్‌లో గౌరవ డాక్టరేట్ స్వీకారం



పేద ప్రజల అభిమానానికి కృతజ్ఞతలు
తెలుపుకుంటున్న శ్రీమతి గాంధీ



సాహసం ప్రదర్శించిన బాలికకి పతకాన్ని
అలంకరిస్తున్న శ్రీమతి గాంధీ



మధ్యప్రదేశ్‌లో గిరిజన సాంప్రదాయిక స్వాగతాన్ని
అందుకుంటున్న శ్రీమతి గాంధీ



నవంబరు 3న స్వర్గీయ శ్రీమతి గాంధీ అంతిమ యాత్ర
శతఘ్ని శకటాన్ని లాగుతున్న త్రివిధ బలాల వారిని
చిత్రంలో చూడవచ్చు



శాంతి వనంలో శ్రీమతి గాంధీ అంత్యక్రియలు చితికి
నిప్పంటిస్తున్న శ్రీ రాజీవ్ గాంధీ

# పక్కింటి కథ

`సింహం

ఆ రోజు ఆదివారం ఉదయం తొమ్మిదయింది గంగాధరంగారు పూజ ముగించుకుని ముందు గదిలో వాలు కుర్చీలో తీరిగ్గా కూర్చుని ఆవేళ్టి పేపరు తిరగేస్తున్నారు లోపల ఆయన భార్య కామేశ్వరమ్మ-గారు వంటపని చూసుకుంటున్నారు

ఇంతలో తలుపు తట్టిన చప్పుడయింది

గంగాధరంగారు లేచి వెళ్ళి తలుపు తీసారు ఎదు-రుగా వున్న వ్యక్తిని చూడగానే ఒక్కసారి అతని మొహం సంతోషంతో విప్పారింది

రావోయి! ప్రసాదు! రా! ఎంత కాలానికి! ఎంత కాలానికి! మళ్ళీ నిన్ను చూస్తాననుకోలేదు రా! లోపలికి రా!

అంటూ వచ్చినతన్ని సాదరంగా ఆహ్వానించి అతను కూర్చోడానికి కుర్చీ చూపించి. ఏఁవోఁయ్! కావుఁడూ! ప్రసాదొచ్చాడు ఓసారిలా రా అని లోపలికి కేకేసారు

ప్రసాదు బిడియపడుతూ గంగాధరంగారు చూపించిన కుర్చీలో కూర్చున్నాడు

ఇంతలో లోపల్నించి కామేశ్వరమ్మగారుఁ చీర కొంగుతో చేతులు తుడుచుకుంటూ అక్కడికి వచ్చారు వస్తూనే-

"ఏంవోయ్! ప్రసాదు! బాగున్నావా! ఉద్యోగం మానేసావని తెలిసింది ఏం చేస్తున్నావు? అమ్మా నాన్నా అంతా బాగున్నారా!"





అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు ప్రసాదుని చూడడంవలన వారిద్దరికీ చాలా ఆనందంగా వుంది

ప్రసాదు ఏదో సమాధానం చెప్పే లోగానే గంగా-దరంగారు అందుకని-

అదేమిటోయ్! ఇంటికి వచ్చిన వాడికి ఇంత కాఫీ ఇవ్వడంలాంటి దేదైనా వుందా? లేదంటే నీ ప్రశ్నలేనా!

అంటూ భార్యకి అతిథి మర్యాద గుర్తు చేసారు

అవును మర్చేపోయాను' అనుకుంటూ లోపలికి వెళ్లి రెండు కప్పులతో కాఫీ పట్టుకొచ్చి ప్రసాదుకొక-టిచ్చి రెండోది భర్తకి అందించారావిడ

కాఫీలు తాగడం పూర్తయాక ప్రసాదు తనొచ్చిన విషయం బయటపెట్టాడు

వచ్చే శుక్రవారంనాడు నా పెళ్లి మా వూళ్లోనే మీరు తప్పకుండా రావాలి

కొంచెం సిగ్గుపడుతూ చెప్పాడు ప్రసాదు

దంపతులిద్దరూ అతని పెళ్లి వార్త విని చాలా ఆశ్చర్యపోయారు కామేశ్వరమ్మగారికైతే ఆ వార్త వినగానే మనసు అప్రసన్నంగా మారిపోయింది అయినా వయసు తెచ్చిన గాంభీర్యంతో తన మనసులోని భావాల్ని బైట పడకుండా చెయ్య-గలిగారావిడ

చాలా సంతోషమయ్యా! పెళ్లి కూతురిదే వూరు?

వివరాలడిగారు గంగాధరంగారు

మా వూరేనండి మా పక్కింటి వాళ్లమ్మాయే చాలా రోజుల బట్టీ వాళ్ళు మా పక్కింట్లో వుంటు-న్నారు మా నాన్నగార్కి మంచి స్నేహితులు కూడా మా అమ్మా నాన్నలకి ఆ పిల్ల నచ్చింది నన్ను చేసు-కోమని బలవంతపెట్టారు శారద పోయాక అసలు పెళ్లే చేసుకోకూడదనుకున్నాను కాని అమ్మా నాన్న ముసలివాళ్లయిపోతున్నారు వాళ్లకోసమైనా నేను మళ్లీ పెళ్లిచేసుకోవాలి అటువంటప్పుడు వాళ్ళు చూపించిన పిల్లనే చేసుకుంటే వాళ్ళు సంతో-షిస్తారు అందుకే ఉద్యోగం మానేసాను పెళ్లి చేసుకుని మా నాన్నగారి వ్యాపారం చూసుకుంటూ ఆయనకి విశ్రాంతి నిచ్చేద్దామనుకుంటున్నాను

చెప్పాడు ప్రసాదు

అతని మాటలకు కామేశ్వరమ్మగారు సంతోషించకపోయినా గంగాధరంగారు ఆనందించారు

తిరిగి ప్రసాదే అన్నాడు

"మీరు నా ఆప్తుల్లోనివారు మీ ఇంటి పక్క రెండేళ్ళు మమ్మల్ని మీ పిల్లల్లా చూసుకున అందుకే మిమ్మల్ని ప్రత్యేకంగా పిలవడాని కొచా బాగా ఆప్తులయిన ఇద్దరు ముగ్గుర్ని తప్పి ఎవర్నీ పిలవదల్చుకోలేదు అందుకే శుభలే కూడా వేయించలేదు అసలు పెళ్లి సెటి కూడాఎన్నో రోజులు కాలేదు మీరు అత్తయ్య తప్పకండా పెళ్ళికి రావాలి

వాళ్ల వూరు, ఇంటి ఎడ్రస్సు, ఏ బస్సెక్కి రా వగైరాలన్నీ చెప్పాడు కామేశ్వరమ్మగారితో కు తప్పకుండా రమ్మనమని ప్రత్యేకంగా చెప్పాడు

తప్పకుండా వస్తామని మాటిచ్చారు వాళ్లిద్ద

ఇంకనే వెళ్లొస్తానండి అంటూ లేచా ప్రసాదు

అదేమిటి, భోజనం చేసి వెళ్ళు

ఇద్దరూ ఒకేసారి అన్నారు

ఈసారొచ్చినప్పుడు చేస్తాను ఇపుడు టైంలే మరోలా అనుకోకండి అని వారిద్దరి దగ్గరా సెల తీసుకుని పెళ్ళికి తప్పని సరిగా రమ్మనమ మరోమారు చెప్పి వెళ్లిపోయాడు ప్రసాదు

ప్రసాదు వెళ్లిపోయాక-



"చూసారా! భార్య పోయి ఆర్నెల్లైనా కాలేదు ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు పెళ్ళి చేసుకున్నాక దేవతలాగ ఆరాధించాడు ఆ అమ్మాయి చనిపోతే పసిపిల్లవాడిలాగ దొర్లి దొర్లి ఏడ్చాడు అటువంటిది ఆర్నెల్లు కూడా తిరగముందే ఆ అమ్మాయిని తొర్చిపోయి మరో పెళ్ళికి సిద్ధపడిపోతున్నాడు ఏమైనా మీ మగాళ్ళంత స్వార్థపరులు మరొకరుండరు అదే పార్వతిని చూడండి ప్రేమించినవాడు మోసంచేస్తే ఆత్మహత్యకి సిద్ధపడింది శారద పోయినప్పుడు ప్రసాదుని చూపించి మీరేమన్నారు అందరూ పార్వతి నన్యాయం చేసిన వాడిలాగే వుండరు. ప్రసాదు చూడు భార్యకోసం ఎంత విలపిస్తున్నాడో అని అటువంటిది ఆ విలాపమంతా ఏమయిపోయింది ఆర్నెల్లైనా తిరక్కుండానే తొలి పెళ్ళాన్ని మర్చిపోయి మరో పెళ్ళిచేసుకోడానికి తయారయిపోతున్నాడు

కామేశ్వరమ్మగారి మాటలకి మధ్యలోనే అడ్డుతగిలారు గంగాధరంగారు

నువ్వలా అంటే నే నొప్పుకోను కాముడూ! ఎంత ప్రేమించి పెళ్ళి చేసుకున్నా పెళ్ళి చేసుకున్నాక దేవతలాగ ఆరాదించినా చచ్చిపోయింది మరి తిరిగి రాదు గదా! పోయిన దానికోసం ఎన్నాళ్ళని విచారించగలడు విచారిస్తే మాత్రం పోయినది తిరిగొస్తుందా! అతని జీవితం అతనొక్కడిదే కాదు తల్లిదండ్రులు ఇంకాబ్రతికేవున్నారు వాళ్ళని సుఖ-

## లేదు టీవి !

పార్శ్యాంశాలు చదవటంలేదు పిల్లలు
ఇంట్లో తిష్ఠ వేసుకు
కూర్చుంటున్నారు మిత్రులు.
దీనికి కారణం క్రొత్తగా కొన్న టి వి
ఇప్పుడు లేదు ఆ ఇంటి ఆమెకు కొనే
ముందున్న టీవి!

—ఎన్.వి.ఆర్.సత్యనారాయణమూర్తి

## పక్కింటి కథ

పెట్టవలసిన బాధ్యత కూడా అతని మీదుంది పైగా తను కూడా వయసులో వున్నాడు నిండా ముప్పయి ఏళ్ళులేవు ఇటువంటి పరిస్థితుల్లో అతను మళ్ళి పెళ్ళి చేసుకోవడమే సరియైన పని

గంగాధరంగారి సమర్థింపు కామేశ్వరమ్మగారికి నచ్చలేదు

"ఎంతైనా మీ మగబుద్ధి పోనిచ్చుకున్నారుగాదు అంటూ విసవిసా వంటింట్లోకి వెళ్ళిపోయారావిడ

గంగాధరంగారు కుర్చీలో జేరబడ్డారు ఆయన మనసు మూడేళ్ళు వెనక్కి వెళ్ళింది

ఎప్పటికింకా గంగాధరంగారు రిటైరవలేదు

గంగాధరంగారి ఇంటి ప్రక్కన డాబా ఇల్లొకటి వుంది ఆ ఇంట్లో ఒక జంట దిగేరు ఆ అమ్మాయి పేరు పార్వతి. చాలా అందమైనది

పార్వతి కామేశ్వరమ్మగారికి . బాగా నచ్చింది పార్వతి కూడా ప్రతి దానికీ "పిన్నిగారూ పిన్నిగారూ" అంటూ కామేశ్వరమ్మగారి చుట్టూ తిరిగేది

పార్వతి వర్ణాంతర వివాహం చేసుకుంది ఇంట్లో పెద్ద లిష్టపడకపోతే ఇద్దరూ గుళ్ళో పెళ్ళి చేసుకుని లేచొచ్చారు

కొన్నాళ్ళు గుంభనగానే సాగింది వాళ్ళ వ్యవహారం

ఓ రోజు కామేశ్వరమ్మగారు పార్వతికోసం వాళ్ళింటికి వెళ్ళేసరికి పార్వతి గదిలో దూలానికి తాడు వ్రేలాడ దీసి ఉరేసుకోబోతోంది కామేశ్వరమ్మగారు కంగారుపడి పార్వతిని గబగబా వాళ్ళింట్లోకి లాక్కొచ్చారు అప్పుడు గంగాధరంగారు కూడా ఇంట్లోనే వున్నారు

పార్వతి ఒకటే ఏడుపు జరిగింది గంగాధరంగారికి చెప్పారు కామేశ్వరమ్మగారు ఇద్దరూ కలసి పార్వతి నోదార్చారు

పార్వతి కలిగున్న వాళ్ళపిల్ల. వాళ్ళ నాన్నగారు పెద్ద ఆఫీసరు. చిన్నప్పట్నుండి పార్వతి ఒంటిమీద బొల్డంత బంగారం వుండేది ఎవడో దుర్మార్గుడు







పార్వతిని ప్రేమించినట్లు నటించి బంగారంతో సహా పార్వతిని లేవుకొచ్చాడు ఇప్పుడు మోజు తీరి-పోయింది బంగారం కూడా అయిపోయింది వది లేసి చక్కాపోయాడు పార్వతి నెల తప్పింది

పార్వతి పరిస్థితి విన్న కామేశ్వరమ్మగారికి, గంగా-ధరంగారికి మనసులు జాలితో నిండిపోయాయి

వెంటనే పార్వతి వాళ్ల తల్లిదండ్రులకు టెలిగ్రా-మిచ్చారు వాళ్ళు ఆదరాబాదరాగా వచ్చారు వారికి జరిగిందంతా చెప్పారు వాళ్ళు లబోదిబోమని గుండెలు బాదుకుని పార్వతిని వాళ్లవూరు తీసుకెళ్లి-పోయారు అక్కడి కెళ్లిన కొన్నాళ్ల తరువాత పార్వతి తనకి ఎబార్షను చేయించేసారని తన ఆరోగ్యం బాగానే వున్నదని వాళ్ల నాన్నగారికి ట్రాన్స్ఫరయే అవకాశాలున్నాయని ఉత్తరం రాసింది ఆ తరువాత నాటినుండి నేటివరకూ పార్వతి భోగట్టా గంగాధరం దంపతులకి తెలీదు

పార్వతి తరువాత ఆ ఇంట్లో ఒక త్రాగు బోతాయన కుటుంబంతో దిగేడు

ఎప్పుడూ తాగేసి రావడం పెళ్ళాన్ని చితక బాదడం ఆవిడ గోలుగోలుమని ఏడవడం ఎవరైన మధ్యకి వెళితే వాళ్లని చంపుతానని బెదిరించడం ఈ న్యూసెన్స్ భరించలేక ఆ వీధిలో వాళ్ళు వాళ్ల నా యిల్లు బలవంతంగా ఖాళీ చేయించేసారు

ఆ తరువాత రెణ్ణెల్లవరకూ ఆ ఇంట్లోకి ఎవరూ దిగలేదు

వారం రోజుల క్యాంపు తరువాత ఆ రోజే వచ్చారు గంగాధరంగారు

పక్కింట్లో హడావుడిగా వుండడం చూసి భార్య నడిగారు

అవునండీ ప్రసాదని మన వాళ్ళే అతను ఎంత-మంచి వాడని! ప్రేమించి పెళ్లి చేసుకున్నాట్ట పెళ్లామంటే ప్రాణం కాలు క్రిందపెట్టనివ్వడు ఎంతసేపూ శారదా శారదా" అని కొంగుపట్టుకునే తిరుగతాడు ఈసారి మనంటి కొచ్చినపుడు చూపి-స్తాను

అంటే అప్పుడే వాళ్లతో స్నేహం చేసేసావన్న-మాట ఆవిడ మాటలకు ఆడ్డు తగులుతూ నవ్వుతూ అన్నారు గంగాధరంగారు

ఆ మర్నాడు సాయంకాలం శారద ప్రసాదులిద్దరూ గంగాధరం గారింటికి వచ్చారు అప్పుడు గంగా-ధరంగారు పేపరు చదువుకుంటున్నారు

నమస్కారం! సార్! పలకరించి తనను తాను పరిచయం చేసుకున్నాడు ప్రసాదు పరిచయం చేసుకోవడమే గాకుండా తన వివరాలన్నీ చెప్పాడు గంగాదరంగారికి అతని కలుపుగోరుతనం, వినయం పెద్దల యెడ అతనికి గల గౌరవం చూసి మురిసిపోయారు గంగావరంగారు ప్రసాదుకి తగ్గ బార్యే శారద ఎన్నిగారూ అంటూ కామేశ్వరమ్మ-గారితో కలిసిపోయింది కొద్దిరోజులకే ప్రసాదు శారదలు గంగాధరంగారి కుటుంబంలో సభ్యుల్లాగ అయిపోయారు ప్రసాదు గంగాధరంగారు కూర్చొని చర్చించని టాపిక్కంటూ వుండేదికాదు కొన్ని కొన్ని సందర్భాలలో గంగాధరంగారి అభిప్రాయాలతో ఏకీభవించలేకపోయినా ఆయన మాట కాదనడం-గాని ఆయన మనసు నొప్పించడంగాని చేసేవాడుకాదు ప్రసాదు ప్రసాదులోని ఆ సద్గుణాన్ని గంగాధరం-గారు ఎంతో మెచ్చుకునేవారు, ప్రసాదు శారదల చిలిపి తగువులు తీర్చలేక ఎంతో ఇబ్బంది పడిపోయేవారు గంగాదరం దంపతులు కామేశ్వ-రమ్మగారు శారద తరఫున గంగాధరంగారం ప్రసాదు తరఫున వకాల్తా పుచ్చుకుని వాదించుకునేవారు ఆఖరికి ఆ పెద్దవాళ్ల ఇద్దరి తగువుల్ని ప్రసాదు శారదలే తీర్చేవారు కాలం ఇంత సంతోషంగా దొర్లి-పోతున్న సమయంలో విధికి కన్నుకుట్టింది

శారదకి తొమ్మిదవనెల వచ్చింది ఏడవ నెల ప్రవే-శించగానే శారద తల్లిదండ్రులు శారదని తీసుకెళ్ల-డానికి వచ్చేరు కాని అప్పుడే పంపడానికి ప్రసాదు ఒప్పుకోలేదు వెళ్లడానికి శారద కూడా ఒప్పుకోలేదు ఒకర్ని వదలి ఒకరు వుండలేని వారి అన్యోన్య దాంపత్యం చూసి గంగాదరం దంపతులకు మనసు పులకించి పోయింది

తొమ్మిదవ నెల వచ్చాక తీసుకెళ్ళురుగాని లెండి మామగారూ! అని చెప్పి మామగార్ని సముదా-యించి పంపించేసాడు ప్రసాదు

శారదకి తొమ్మిదవ నెల వచ్చింది వచ్చి తీసు-కెళ్లమన ఉత్తరం ధ్రాసాడు ఇంతలో అనుకోకుండా

ఇటీవల ఫిన్‌లాండ్‌లో జరిగిన ఆరవ అంతర్జాతీయ బాలల చిత్రకళాప్రదర్శనలో స్వర్ణపతకాలు గెలుచుకొన్న గోల్కొండ (హైదరాబాదు) కేంద్రీయ విద్యాలయ విద్యార్థి విద్యార్థినులు చి వి మురళి, కుమారి సరితాసింగ్, కుమారి వీణా గోస్వామి కుమారి నూర్జహాన్ చి రాజ్‌పాల్, చి పవన్‌ప్రకాష్‌లను చిత్రంలో చూడవచ్చు



# ఇ'వేమన' పద్యాలు




ఇసుక బొగ్గు ఇాయి యినుమును స్వర్ణంబు
కసవు పోచల వలె గన్నవాడు
పరమ పదము గాంచు పరిణామమందును
విశ్వదాభిరామ వినురవేమ.

క్యాంపు కెళ్ళవలసిన అవుసరం పడింది ప్రసాదుకి అతను అప్పటికి పోస్టల్ ఇన్స్పెక్టరుగా పని చేస్తు న్నాడు ఆ ప్రయణాన్ని ఏ విదంగా తప్పించుకుందా-మన్నా అవలేదు అతనికి చేసేదిలేక గంగాదరంగారికి కామేశ్వరమ్మగారికి శారదని అప్పజెప్పి శారదకి పసి-పిల్లకి చెప్పినట్లు జాగ్రత్తలు చెప్పి రెండు రోజుల్లో వస్తానంటూ అయిష్టంగా బయలుదేరి వెళ్ళాడు ప్రసాదు

ప్రసాదు క్యాంపు కెళ్ళిన్నాడు రాత్రే అనుకోని

## పక్కింటి కథ

ఘోరం జరిగిపోయింది

నూతి చప్టామీద కాలుజారి పడుపోయింది శారద హాస్పటల్కి తీసుకెళ్తూ వుండగా దారిలోనే చనిపోయింది

వెంటనే ప్రసాదుకి టెలిగ్రామిచ్చారు

ఆ టెలిగ్రాం చూడగానే కొయ్యబారిపోయాడు ప్రసాదు అతని కొలీగ్సు అతన్ని దగ్గరుండి తీసు-



కొచ్చారు శారద శారదా అని భార్య శవంమీద-పడి రోధించిన తీరు ఎంతటి కఠిన హృదయాల-నైనా కరిగించకమానదు

శారద పోయాక ప్రసాదు పిచ్చివాడిలాగ అయిపోయాడు రెండుసార్లు ఆత్మహత్యా ప్రయ-త్నం కూడా చేసుకున్నాడు ఆ రెండుసార్లూ గంగా-దరంగారే అతని నీడలా వుండి అతన్ని ప్రయత్నం-నుండి విరమింపజేసారు ఇంతలో ప్రసాదు తల్లి-దండ్రులు వచ్చారు కొడుకు పరిస్థితిని అతనికి కలిగిన కష్టాన్ని చూసి కృంగిపోయారా వృద్ధు-లిద్దరూ గంగాధరంగారు వారిద్దరినీ ఊరడించారు ఆ తరువాత, గంగాదరంగారి సలహామీద ప్రసాదు చేత వుద్యోగానికి సెలవు పెట్టించి ప్రసాదుని వాళ్ల వూరు తీసుకెళ్లిపోయారు ప్రసాదు తల్లిదండ్రులు ఆ తరువాతెప్పుడో ప్రసాదు ఉద్యోగం మానేసాడని గాలివార్త తెలిసింది గంగాదరంగారికి

శారద చచ్చిపోయిన నక్షత్రం మంచిదికాదని ఆ ఇల్లు పాడు బెట్టారు శారదపోయి ఇంకా ఆర్నెల్లు పూర్తవలేదు

భోజనానికి లేవండి

భార్య పిలుపుతో ఈ లోకంలోకి వచ్చారు గంగా-దరంగారు

* *

గంగాధరంగారు కామేశ్వరమ్మగారు ప్రసాదిచ్చిన ఎడ్రస్సు ప్రకారం వెతుక్కుంటూ వాళ్లిల్లు చేరు-కునేసరికి సాయంత్రం చీకటి పడింది

ఆ రోజు రాత్రే పెళ్లి

గంగాధరం దంపతుల రాకకి ప్రసాదు అతని తల్లి-దండ్రులు చాలా సంతోషించారు గంగాధరంగారు కామేశ్వరమ్మగారు మరో ముగ్గురు మాత్రమే వున్నారు మగపెళ్లివారు

ముహూర్తం దగ్గర పడింది

ఆడ పెళ్లివారు మగ పెళ్లివారు అంతా కలిపి పదిమంది లేరు పందిట్లో

పురోహితుడు మంత్రాలు చదవడం ప్రారంభిం-చాడు ఏ ఆర్భాటమూ లేకుండా ప్రారంభమైంది పెళ్లితంతు

తలదించుకుని వచ్చి ప్రసాదు ప్రక్కన కూర్చున్న పెళ్లి కూతుర్ని చూడగానే ఆశ్చర్యంతో ఊహించని సంఘటన ఎదురైన సంబరంతో తడబడిపోయారు గంగాధరంగారు కామేశ్వరమ్మగారు సంతోషంతో మనసులు ఆర్ద్రమై పోయాయి ఆనందంతో కళ్ళ వెంబడి నీళ్ళొచ్చేసాయి వాళ్ళిద్దరికీ అన్యాయంగా ప్రసాదుని నిందించినందుకు నొచ్చుకున్నారు కామే-శ్వరమ్మగారు ఇప్పుడేమంటావు అన్నట్లుగా చూసారు గంగాదరంగారు భార్య వైపు

ఇద్దరూ నిండు మనసుతో ఆ నవ దంపతుల్ని ఆశీర్వదించారు

వారిద్దరి అంతులేని ఆనందానికి కారణభూతు-రాలైన ఆ పెళ్ళి కూతురు మరెవ్వరో కాదు

పార్వతి!!!













# అమృతాంజన్‌కే తెలుసు తల నొప్పి బాధ

మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ








1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు

## అమృతాంజన్

ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి

OBM 8708 TG




## రేడియో హిప్నాటిజమ్!

ఇంగ్లాండ్‌లో అక్స్ బ్రిడ్జ్‌లోని ప్రముఖ హిప్నా-టిస్ట్ జె లూయిస్ ఆర్టాన్ ప్రముఖ ఫ్రెంచి సైకాల-జిస్ట్ ఎమ్ క్యూగారితో కలిసి భూమికి రెండువేల అడుగుల ఎత్తులో పయనిస్తున్న ఒక విమానంలో ఉన్న శ్రీమతి ఇయాన్ కోవార్ట్‌ను హిప్నటైజ్ చెయ్య-గలిగారని 'చికాగో ట్రిబ్యూన్' ప్రకటించింది

## హిప్నాటిజమ్ - హిస్టీరియా

కిన్సినటి, ఓహియో నగరంలో ఒక నైట్ క్లబ్‌లో జరిగిన దెబ్బలాటవలన శ్రీమతి పెగ్గీరీఫ్ అనే ఇరవై నాల్గేళ్ల స్త్రీకి కలిగిన 'హిస్టీరికల్ ఎమ్నీషియా' స్థితిని హిప్నాటిజమ్ వలన జనరల్ హాస్పిటల్ ఇన్‌ఛార్జి డాక్టర్ మేయర్ జలిగ్ నయం చేసారని, ఆ తరువాత శ్రీమతి రీఫ్ ఎప్పుడూ అటువంటి స్థితిని పొందలేదని చికాగో హెరాల్డ్ అండ్ ఎక్జామినర్' ప్రకటించింది




## హిప్నాటిజమ్‌తో దొంగతనం

బెర్లిన్‌లో 'స్వెంగాలి ఫైవేమేన్' అనే క్రొత్త రకపు నేరస్థుడు నగరాన్ని ఉలిక్కిపడేలా చేసాడు

ఆధునిక సమాజంలో చదువుకున్న నేరస్థుడు రివాల్వర్‌తో కాక హిప్నాటిజమ్ ఉపయోగించి దొంగ-తనం చేసిన ఉదంతమిది ఈ కొత్తరకం శత్రువును అణచడానికి బెర్లిన్ పోలీసు వర్గాలు శాస్త్రీయ విజ్ఞానంతో పరిశోధించి చివరకు శత్రువును పట్టుకో-గల్గారు ఒక రుమానియన్ వ్యాపారస్థుడు తీరిక వేళలో బెర్లిన్ అటార్నీతో సంతకం చేయించిన ఒక రికమెండేషన్‌తో ఒక ప్రముఖ వ్యాపారస్థుడు దగ్గర భారీ మొత్తాన్ని తీసుకున్న విషయం అందర్నీ కలవర పరిచింది ఆ రికమెండేషన్ తనే చేసినట్టు తనకు గుర్తులేదని అటార్నీ చెప్పడం, ఆ సంతకం అటార్నీదేనని ఏ విధమైన ఫోర్జరీ కాదని ప్రముఖ దస్తూరీ నిపుణులు ప్రకటించడంతో గగ్గోలు పుట్టింది కొంత కాలానికి ఆ అటార్నీ తనను అంతకు ముందే హిప్నటైజ్ చేసారని చెప్పడంతో కేసు మరో మలుపు తిరిగింది నిత్య సందేహి ఐన ఆ ప్రముఖ వ్యాపారస్థుడు చివరికి ఎట్లాగైతే ఇచ్చిన ధనంలో సగం మొత్తం మాత్రమే బెర్లిన్ అటార్నీ ఇవ్వడానికి ఒప్పుకున్నాడు ఆఖరికి ఆ మోసగాడిని పట్టు-కున్నారు ఈ విషయాన్ని 'చికాగో హెరాల్డ్ అండ్ ఎక్జామినర్' ప్రకటించింది

## హిప్నాటిజమ్ – సొమ్ము కొల్లగొట్టడం!

న్యూయార్క్ పట్టణంలో జోసఫ్ వాల్కర్ అనే ధనవంతుడు హిప్నాటిజమ్ వలన తన సొమ్ము కొంత పోగొట్టుకోవడం అప్పట్లో సంచలనాన్ని సృష్టిం-చింది ఒక రోజు, ఒక నడివయస్సు స్త్రీ అతడిని ధన సహాయం కోరడానికి వచ్చింది ఆ మాట్లాడుకోడం-లోనే ఆమె అతడిని హిప్నటైజ్ చేసిందట అతడు మేల్కొనేసరికి ఆమెతో పాటు కొంత సొమ్ము కూడా లేకపోవడం గమనించాడు న్యూయార్క్ ఇన్వెస్టి-గేటర్స్ మొదట ఆ విషయాన్ని వాల్కర్ కలగన్నా-డేమో అనుకున్నారు కానీ అలాంటివి చాలా సంఘటనలు జరగడంతో నమ్మారు దీనిని కూడా 'చికాగో హెరాల్డ్ అండ్ ఎగ్జామినర్' ప్రకటించింది

## హిప్నాటిజమ్ – దంత వ్యాధి

క్లీవ్‌లాండ్‌లో వెస్టర్న్ యూనివర్శిటీకి సంబం-ధించిన డెంటల్ క్లినిక్‌లో పనిచేస్తున్న డాక్టర్ విలియమ్ సి బ్యూటిల్ తన అనుభవాన్ని వివరిం-చారు

ఒకరోజు, ఒక యువతి, ఆమె స్నేహితుడు బ్యూటల్ దగ్గరకు వచ్చారట పళ్ల వ్యాధితో బాధ-పడుతున్న ఆమెకు, సాధారణంగా తిమ్మిరి కలిగించే 'నోవకైన్' ఇంజక్షన్ ఇస్తున్న బ్యూటల్‌ను వారించి,




ఆమె స్నేహితుడు ఆమెను హిప్నాటిక్ ట్రాన్స్‌లోకి పంపించాడు ఆ చికిత్స కొనసాగినంతసేపూ ఆమెకు ఏ బాధా లేకుండా హాయిగా ఉండేలా సజెషన్స్ ఇచ్చాడు అంతా అయిన తరువాత ఏ నొప్పి లేకుండా ఉన్న ఆమెను చూసి బ్యూటిల్ ఆశ్చర్య-పోయాడు అరగంటలో ఆమె చక్కగా భోజనం చేసింది

ఈ విషయం 'ది చికాగో డైలీ న్యూస్' పత్రిక ప్రచు-రించింది

## ఐస్ ఛాంబర్‌లో 28 రోజులు!

సుమారుగా ఏభై సంవత్సరాల క్రితం జర్మనీలోని లీప్జిగ్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా ఉన్న డాక్టర్ క్లాజెనర్ జంతువులను, కీటకాలను ఐస్ కేక్స్ మధ్య శీతలంలో ఉంచి వాటి ప్రవర్తనను, జీవనాన్ని గమనించేవాడు అతనికి మానవుని మీద ఆ ప్రయో-గం నిర్వహించాలని ఉండేది ఆ ప్రయోగానికి

యూనివర్సిటీవారు సమ్మతించక పోవడంతో అతడు స్వంతంగా ఒక గ్రామీణుడిని ఒప్పించి ఆ తరువాత నిర్వహించగలిగాడు అతడిని హిప్నటైజ్‌చేసి ముందుగా ఒక సోఫామీద పడుకోబెట్టి, ఆ హిప్నాటిక్ ట్రాన్స్‌లో ఉన్న సబ్జెక్ట్‌ను (అతన్ని) శీతలీకరణం చేయబడిన ఒక ఐస్ ఛాంబర్‌లోనుంచాడు అనుక్షణం సబ్జెక్ట్ ఆరోగ్యం తీరుమీద, ముఖ్యంగా గుండెరీతిని జాగ్రత్తగా పరిశీలించాడు సరిగ్గా 28 రోజుల తరువాత అతడిని ట్రాన్స్‌నుండి లేపి, మెలుకువ తెప్పించి, బయటకు తీసుకొచ్చాడు సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్న ఆ గ్రామీణుడు మొట్టమొదట అడిగిన దేమంటే 'ఒక గ్లాసుడు చల్లని నీరు కావాలని' 'చికాగో ఈవెనింగ్ అమెరికన్' పత్రిక ఈ ప్రయోగాన్ని ప్రకటించింది

## హిప్నాటిజమ్ – సన్నబడుట

ఆక్స్‌ఫర్డ్ నగరంలో మియామీ యూనివర్సిటీలో పనిచేస్తున్న ప్రొఫెసర్ ఇ ఎఫ్ పాటిన్ మరియు ప్రొఫెసర్ ఎస్ ఎ స్విట్జర్ అనే ఇర్వురు సైకాలజిష్టులు తమ లేబరేటరీలో హిప్నాటిజమ్‌తో బరువు తగ్గించటం, సెల్ఫ్ – కాన్ఫిడెన్స్ పెంచటం, మద్యపాన, ధూమపానాలపై ఆసక్తిని మాన్పించటంలాంటి ఎన్నో ప్రయోగాలను విజయవంతంగా నిర్వహించారు ఒక పద్దెనిమిదేళ్ల యువతి తాను లావు తగ్గి, సన్నగా తయారవ్వాలని కోరుకోవడంచేత 'పోస్ట్ హిప్నాటిక్ సజెషన్' అనె హిప్నాటిక్ టెక్నిక్ ఉపయోగించి ఆమె బరువును పెంచే కార్బో హైడ్రేట్స్ ఉన్న తిండిని తినడాన్ని నిరోధించడంవలన ఆమె బరువును తగ్గించి సన్నగా తయారయేలా చేసారని 'ది చికాగో డైలీ న్యూస్' పత్రిక ప్రకటించింది

ఈ వింతలే కాదు నేడు హిప్నాటిజమ్‌నుపయోగించి 'హిప్నోథెరపీ' ద్వారా ఎన్నెన్నో వ్యాధులను నయం చేస్తున్నారు నేటి ఆధునిక సమాజంలో హార్ట్ ఎటాక్, బి పి వంటివే కాకుండా స్త్రీ ప్రసవించేటప్పుడు అనుభవించే వేదనను తొలగించి సుఖ ప్రసవం జరిగేలా కూడా చేస్తున్న హిప్నాటిజమ్ పాత్ర అభినంధనీయం

మన దేశంలో ప్రాచుర్యం పొందని ఈ శాస్త్రం 'మానవ జీవితంలో అనుదినం ఉపయోగ పడుతుంది' అనే నిజం ప్రతి మానవుడికి తెలిసిననాడు ఈ జీవనమే సుఖమయమవుతుంది

మంచికి కాని చెడ్డకుగాని ఉపయోగించబడే హిప్నాటిజమ్, హిప్నాటిస్ట్‌లు ఉపయోగించడాన్ని తన ఎథిక్స్ ద్వారా నిరోధిస్తోంది

ప్రజాసేవ చెయ్యాలనుకునే ఏ హిప్నాటిస్ట్ చెడులో పాలు పంచుకోలేడు

హిప్నాటిజమ్ మానవ అంతర్లీన శక్తులను వెలికి తీస్తుంది హిప్నోదెరపీ మన దైనందిన జీవితంలో చోటు చేసుకునే రోజు త్వరలోనే వస్తుందని ఆశిద్దాం ప్రదర్శనల ద్వారా హిప్నాటిజం శక్తిని అందరికి తెలియజేస్తున్న తోటి హిప్నాటిస్ట్‌లకు అభినందనలు

హిప్నో రవిశంకర్ □

### కుక్కలకోసం ప్రత్యేకంగా ఒక హోటల్ నడుపుతున్న కవలలు!

శునకాలకోసం ప్రత్యేకంగా ఒక హోటలుంది అంటె నమ్మరేమో? కానీ ఇది నిజం! పశ్చిమ జర్మనీలోని హాంబర్గ్ నగర సమీపంలో ఇద్దరు సోదరులు ఈ హోటలును నడుపుతున్నారు. ఈ హోటలులో శునకాలకోసం ఆరు టేబుళ్ళను ఏర్పాటు చేశారు. అవి తీసుకునే ఆహారాన్ని బట్టి బిల్లు ఉంటుంది. శునకాలను తీసుకొని వచ్చే వారికి ఉచితంగా కాఫీ టీలు అందిస్తారు. ఈ హోటలును నడుపుతున్న సోదరులు కవలలు కావడం మరో విశేషం. ఈ హోటలుతోపాటు వీరు శునకాలకోసం ఒక బ్యూటీ క్లినిక్‌ని కూడా నిర్వహిస్తున్నారు! (గ్లోబల్)

## సీరియల్

# కాగితప్పడవలు

-యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

చాల తొందరగ నడుచుకుంటు జయలక్ష్మి స్టేషను చేరింది ఆసరికి ఫ్లాట్-ఫారమ్‌మీద రామారావు నించుని జయలక్ష్మి కోసం ఓవర్ బ్రిడ్జి వైపు చూస్తున్నాడు బండి మరో అయిదు నిముషాలకు బయలు దేరుతుందనగ జయలక్ష్మి తొందరగ రావడం కనిపించింది హృదయం ఒక్కసారి తేలికయింది రామారావు ఏమేమో ఊహించుకున్నాడు ఆ కారు ఆసామి జయలక్ష్మి బాయ్ ఫ్రెండు అయుంటాడని ఇద్దరు ఎక్కడకో షికారు పోయుంటారని, ఆలస్యంగా ఏదో బస్సులోనో ట్రెయినులోనో జయలక్ష్మి కొత్తవలసకు పోతుందని ఊహించుకున్నాడు జయలక్ష్మి అంత త్వరగ వచ్చేయడం రామారావుకి మనస్సులో బెంగ లేకుండ చేసింది కాని మనస్సులో చిన్న ముల్లు గుచ్చుకునే ఉంది

రామారావు ఫ్లాట్‌ఫారమ్ మీద తన కోసం యెదురు చూస్తూ ఉండడం జయలక్ష్మికి బోలెడంత బలాన్ని చేకూర్చింది పైగా తన గోడును చెప్పుకుని హృదయారాటాన్ని తగ్గించుకునేందుకు వీలు కల్గిందని భావించింది

మీ రిప్పుడే వచ్చారా?

అవును

జయలక్ష్మి ఆశించినట్లు మీరు రావడం అలస్యమయిందేమని రామారావు ఆమెను ప్రశ్నించలేదు ముభావంగానే 'అవును అని జవాబిచ్చేడు జయలక్ష్మికి ఒక్కసారిగ నిరుత్సాహం కల్గింది ఆమెకుఒక్కసారి దుఃఖం ముంచుకొచ్చింది తనకు స్నేహితుడనుకున్న రామారావు దూరంగానే ఉన్నాడు తను ఈ విశాల ప్రపంచంలో ఒంటరిది'

ఇద్దరు చేరువలో నే సగం కోచ్ ఖాళీగా ఉన్న దాంట్లోకి ఎక్కుతున్నారు ముందుగా జయలక్షి ఎక్కుతూంది తొందరగ ఎవడో వచ్చి ఆమెను తోసుకుంటు లోనికి పోయేడు అసలే చికాకుతో ఉన్న రామారావుకి ఒక్కసారి కోపం వచ్చింది ఒక్క గెంతుతో లోనికి వెళ్ళి ఆ ఆసామి జబ్బ పట్టుకున్నాడు

ఏమయ్యా' కండ్లు కనిపించడం లేదా అలా ఆడదాన్ని త్రోసుకుంటూ ఎక్కి పోయేవు జన సమ్మర్దం లేదు కదా ఏమా తొందర? అని గట్టిగా అడిగేడు ఆ యువకుడు తిరగబడ్దా మనుకున్నాడు గాని వీళ్ళ వెనుక ఎక్కుతున్న ముగ్గురులో ఒకడు – అదో రకం పోయే కాలం, అని అనేసరికి వీళ్ళ బలగం ఎక్కువగా ఉందని గ్రహించి తగ్గిపోయి

సారీ అండి' గార్డు విజిల్ వేస్తే బండీ ఎక్కడ కదిలిపోతుందో అని తొందరలో ఎక్కిపోయేను – సారి, అని ముందుకు పోయేడు

జయలక్ష్మి, రామారావు ఎదురెదురుగా ఒక ప్రక్క కిటికీ వద్ద కూర్చున్నారు ఆ బెంచీలమీద మరెవ్వరూ లేరు జయలక్ష్మి మరి దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది కట్టు తెగిన యేరులా దుఃఖం ప్రవహించింది

ఆమె 'దుఃఖాన్ని చూసి రామారావు చలించిపోయేడు మనస్సులో అతడికి ఏమాత్రం సందేహమున్న ఆమె దుఃఖంలో కొట్టుకు పోయింది

జయలక్ష్మిగారూ' ఏమా యేడుపు ఇంత చిన్న విషయానికి యేడవాలా అతడు పొరబాటు జరిగిందని సారి చెప్పుకున్నాడుగ

ఈ విషయం కాదండి నేను లేచిన ఈ రోజు బాగు లేదు నా కివాళ అన్నీ అవమానాలే

'అంటే ఇంకేమైన జరిగిందా? ఆ కారు అతడితో ఏమైన ఘర్షణ జరిగిందా? మనస్సులోని సందేహాన్ని వెలిబుచ్చేసేడు

అంత దుఃఖంలోను జయలక్ష్మి చటక్కుమని తలెత్తింది నింపాదిగ కండ్లు తుడుచుకుంది

'అయితే నేను కారు ఎక్కడం మీరు చూసేరన్నమాట అందుకేనా నేనెంతసేపటికి వస్తానో గమనించడానికేనా అలా నా కోసం ఫ్లాట్‌పారంమీద నిలబడి పోయేరు అనుమానపు మొగ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు , అని కాస్త కోపంగానే అంది

రామారావు మనస్సు గాయపడింది అందుకే కాస్త బాధగ అన్నాడు –

"అవునండి మీరు పరాయి మొగవాడి కారెక్కి వెళ్ళడం సబబుగా ఉంది కాని నేను అడగడమే మీకు తప్పుగా తోచింది మీరు స్త్రీ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు అందుకే మీ ఆలోచన అంత అవక తవకగా ఉంది

జయలక్ష్మికి బాధ పోయి కాస్త కోపం యెక్కువైంది అందుకే వెటకారంగా అంది –

'అతడు పరాయివాడు కాదండి నా బెస్ట్ బాయ్ ఫ్రెండు "

ఆ జవాబుతో రామారావుకి ఉడుకుమోతుతనం, కోపం ఉధృతమయ్యేయి

"అయితే ఆ యేడుపు ఎందుకు సంతోషించక "

వెంటనే జయలక్ష్మికి తెలయ వచ్చింది – ఏమిటి తన యీ సాధింపు ఏమిటి తమ ఈ పోట్లాట భార్యా భర్తలులా పాపం రామారావు ఎలా నొచ్చుకుని బుంగమూతి పెట్టేడో!"

రామారావు చటక్కున లేచి చిరుకోపంతో ప్రక్కన మరో ఖాళీ బెంచీ ఉంటే వెళ్ళి కూర్చున్నాడు జయలక్ష్మికి అప్పుడు తెలిసి వచ్చింది, తన కున్న ఒకే ఒక్క నిరలమైన స్నేహితుణ్ణి పోగొట్టుకుంటుందని

వెంటనే జయలక్ష్మి లేచి వెళ్ళి రామారావుకి ఎదురుగా కూర్చుని అతడి ముఖంలోకి చూసింది రామారావు ముఖం త్రిప్పుకున్నాడు జయలక్ష్మి మనస్సు మళ్ళీ బాధతో మూల్గింది మళ్ళీ అప్రయత్నంగ కంటి వెంట నీరు కార జొచ్చింది ఆమె రుమాలుతో కండ్లు ఒత్తుకోడం చూచి రామారావు చలించి పోయేడు అతడి కోపం, అసూయ అన్నీ ఆ కన్నీరులో కొట్టుక పోయేయి అతడి మనస్సు ఆమె యెందు జాలితో నిండిపోయింది

మరి చిన్న పిల్లలా యేడ్వకండి ఇలా చూడండి ఇప్పుడు చెప్పండి జరిగిం దేమిటో

నా కివాళ ఆ పాడు సిటీ బస్సు ఎంత సేపు నించున్నా రాలేదు స్టేషనుకు టైమైపోతుంది గబగబ నడుచుకుని పోదామని రెండడుగులు వెయ్యగానే ఆ కారు నా ప్రక్కన వచ్చి ఆగింది లిఫ్టు ఇస్తాను అయిదు నిముషాలలో స్టేషనుకు దిగబెడతానని నన్ను పూర్తిగా ఆలోచించనీయకుండ వత్తిడి చేసేడు మనిషికి ముప్పై అయిదేళ్ళుంటాయి చూడడానికి చాల పెద్ద మనిషిలా ఉన్నాడు బోలెడంత ట్రాఫిక్ ఉన్న రోడ్డు అన్న ధైర్యంతో కారెక్కేను – గాని అతడు పిచ్చి పిచ్చి చేష్టలు చేసి నన్ను హోటలు కొస్తావా, షికారు కొస్తావా అని రంగంలోకి దిగేడు స్టేషను దగ్గర కారు ఆపక

**జరిగిన కథ-2 : ఎగ్రికల్చరల్ సూపర్వైజరుగా వచ్చిన మోహనరావుకి ఆ ఊరి పెద్దల కోరికపై తమ ఇంట్లో భోజనానికి ఏర్పాట్లు చేస్తారు రామారావు తండ్రి జనార్ధనయ్య. జయలక్ష్మి తండ్రి కుటుంబరావు ఓ విచిత్రమైన మనిషి. జయలక్ష్మి ఎవరి కారులోనో ఎక్కడం చూసిన రామారావు మనస్సు చివుక్కుమంటుంది.**

పోతుంటే నేను గట్టిగ కేక వేస్తే స్టేషనుకు దూరంగ ఆపి పోయేడు ఇకముందు ఎక్కడకు పోతావులే అని బెదరించేడు కూడ నా కివాళ జరిగిన అవమానం అయిదేళ్ళయి ఉద్యోగం చేస్తున్నాను గాని ఎప్పుడూ జరగలేదు అసలే నేను బాధ పడి వస్తే ట్రెయి నెక్కుతుంటే ఆ దౌర్భాగ్యు డెవడో నన్ను తోసుకుంటూ పోయేడు ఇవాళ నా రోజు బాగులేదు మీరు నన్ను అపార్థం చేసుకుని మూతి ముడుచుకున్నారు నా గోడు మరెవరితో చెప్పుకోను చెప్పండి మా ఇంట్లో మా నాన్నతో చెప్తే నన్నే తిరిగి తిట్లు తిడతారు నాకు ఆడ స్నేహితులుగాని లేరు మీతో చెప్పుకొని యేడుద్దామంటే మీరు కోపంగా ఉన్నారు చెప్పండి

నన్ను క్షమించండి జయలక్ష్మిగారు మీ కింత బాధ కల్గించేననుకోలేదు ఇంతకీ ఆ రాస్కెల్ కారు నంబరు నోట్ చేసారా?

లేదండి – పోనీండి నా బాధంతా మళ్ళీ రోడ్డు కాసి నన్నేమి అల్ల ప పెడ్తాడోనని

రామారావుకి చాలకోపం వచ్చింది

ఇక ముందు వాడు మిమ్మల్ని పలకరిస్తే నేను వాడ్ని పాతేస్తాను నేనుండగ మీకా భయం వద్దు మీరు మరోలాగనుకోకపోతే మీరు ఆఫీసు వదిలేక ద్వారకానగర్ బస్ స్టాప్‌లో ఎక్కడ పోలీస్ స్టేషనో బస్సు స్టాపుకు రండి ఈ రెండు స్టాపులు మీకు ఒకేదూరంలో ఉన్నాయి నేను పోలీసు స్టేషను బస్సుస్టాపుకే వస్తుంటాను అక్కడ ఇద్దరం కలసి బస్సెక్కుతుందాం రోజూ – ఏమంటారు?

చాల థాంక్సండి – అలాగే చేస్తాను మీ సహాయ ముంటే నాకు చాల ధైర్యంగా ఉంటుంది

జయలక్ష్మికి మనస్సులోని ఆందోళన పోయింది మంచి స్నేహితుణ్ని సంపాదించుకున్నందుకు మనస్సుకు ఆహ్లాదం ఉంది రామారావు హక్కుగా తనను సంరక్షిస్తానంటుంటే జయలక్ష్మికి ఆనందంగా ఉంది రామారావు చూపులోగాని మాటల్లోగాని చేష్టలలోగాని అనురాగం లాలిత్యం తప్ప



## కాగితపు పడవలు

మోహం వెలికితనం లేకపోవడం జయలక్ష్మి హృదయానికి చాల హాయిగా ఉంది

ఈ సంఘటనతో రామారావు జయలక్ష్మి మరింత సన్నిహితులయ్యేరు ఆనాటి నుండి వారిద్దరు మంచి స్నేహితులుగ వ్యవహరించడం మొద లెట్టేరు

### 5

తల్లి ప్రోద్బలంతో పెద్దమ్మాయి సుభద్ర వడ్డనలో సహాయం చేస్తుండేది రెండు వారాలయేసరికి 'నెయ్యి చాలు', పులుసు వెయ్యండి', అనే సంభాషణనుంచి మోహనరావు మామూలు భాషణలోకి దిగేడు

మోహనరావు కాస్త నెమ్మదస్తుడే అతడికి సుమారు ఇరవై తొమ్మిది సంవత్సరాల వయస్సుంటుంది బి ఎస్ సి అగ్రికల్చర్ పాసయ్యేడు ఏ దురలవాట్లు లేని మంచి యువకుడు మోహనరావు జనార్ధయ్యగారింట్లో పెండ్లికి సిద్ధంగా నున్న ఇద్దరు ఆడపిల్లలున్నారని వాళ్ళింటికి చేరిన మూడవ రోజునే తెల్సుకున్నాడు కుతూహలంకి ఇద్దర్ని బాగా గమనించేడు కొద్ది రోజులయేసరికి పెద్దమ్మాయి బాహటంగ, రెండవ అమ్మాయి జంకుతో రహస్యంగ మాట్లాడేవారు ముఖ్యంగా మోహనరావే రెండవ అమ్మాయి తనతో మాట్లాడడానికి వీలు కల్పించే వాడు

ఓనాడు భోజనానికి వచ్చేసరికి రెండవ అమ్మాయి ఏదో పుస్తకం చదువుతో ముందు గదిలో ఉంది ఆ అమ్మాయికి తెల్సు ఆ సమయానికి మోహ్నరావు భోజనానికి వస్తాడని

"ఏమండి నాన్నగారు ఇంట్లో ఉన్నారా?

లేరండి

'అమ్మగారున్నారా?

ఉన్నారండి

మీ పేరు?

పార్వతి

'ఎంతవరకు చదువుకున్నారు?

అమ్మా పార్వతి! అబ్బాయి వచ్చాడా?

అదిగో అమ్మ పిలుస్తోంది – లోనికి వెళ్ళండి

గబగబా మోహనరావు లోనికి వెళ్ళేడు

మరోనాడు మోహనరావు వస్తుంటే వీధిలో పార్వతి ఎదురైంది

ఏమండీ! ఎక్కడికి మిట్ట మధ్యాహ్నం ప్రయాణం?

మిమ్మల్ని పిలుచుకోవద్దామని – చిరునవ్వుతో పెంకిగా జవాబిచ్చింది

ఏమిటి విశేషం – ఇంత ఆహ్వానం దేనికి?'




సిగ్గు పడుతున్నట్లు నటిస్తు – ఇంటికి వెళ్ళండి – అమ్మే చెప్తుంది

నేను ఎదురు పడ్డానుకదా – మీరు రండి

కాదండి – పురోహితుడిని కూడ పిలుచుకుని రమ్మన్నారు, అని నవ్వుతూ తొందరగ పోయింది

పార్వతి నవ్వుతు చెప్పినా మోహనరావుకి కాస్త గాభరాగానే ఉంది

భోజనం చేస్తూ మోహనరావు కామేశ్వరమ్మను అడిగేడు –

పార్వతిగారు ఎక్కడకండి అంత తొందరగ పోతున్నారు?

అప్పుడే వచ్చిన పార్వతి – ఉండండి నేను చెప్తాను – అమ్మా! ఇదిగోనే ఉప్పు అదేనండి కారణం, అని నవ్వుతూ గదిలోకి తుర్రుమంది

ఆనాడు మొట్ట మొదటి సారిగ కామేశ్వరమ్మకు అనుమానం కల్గింది వీరిరువురి మద్య స్నేహం పెరుగుతుందని కామేశ్వరమ్మకు తెల్సు సుభద్ర కన్న పార్వతి అందగత్తె కాకపోయినా పార్వతి చురుకైనదని సుభద్ర ఎక్కువగ ఎవరితోను మాట్లాడక చాల నెమ్మదిగ ఉంటుందని ఆ చురుకు-దనం వల్ల పార్వతి ఆకర్షణీయంగ అగుపిస్తుందని కామేశ్వరమ్మ పార్వతిని కొన్నాళ్ళు అన్నగారింటికి విజయనగరం పంపిస్తే బాగుంటుందని అనుకొంది ఆమాట రహస్యంగా బర్త జనార్దనయ్యకు తెల్పింది

బాగుండదే అకారణంగ రెండవ అమ్మాయిని పంపించేసి పెద్ద-మ్మాయిని ఎరగా వేసేరనుకుంటాడు అబ్బాయి ఇంతకీ మన అమ్మాయిలను నచ్చాలిగ వాళ్ళు గోదావరి జిల్లా వాళ్ళు వాళ్ళ కట్న కానుకలు విశాఖ జిల్లాకు రెండింత లుంటాయి అబ్బాయి ఇద్దరిలో ఏ ఒక్కరిని నచ్చి పెండ్లి చేసుకుంటానన్న వాళ్ళ తల్లి దండ్రులు కోరే కట్న కానుకలు మనమిచ్చుకో-వద్దూ అదంతా ఆడియాసే అవుతుంది

మోహనరావు పని అయిపోయింది ఇంకా మూడు రోజులలో అతడు రాయవరం వెళ్ళిపోతాడు కంటకాపల్లి నుండి ఆమాటే అతడు జనార్ధనయ్య-తోను, కామేశ్వరమ్మతోను చెప్పాడు

మీకు నా దన్యవాదాలండి ఇన్నాళ్ళు ఎంతో ఆదరంతో నా తల్లి దండ్రుల్లా నన్ను చూసుకున్నారు మీకు నా కృతజ్ఞతలు ఏవిదంగా చెప్పుకో-వాలో నాకు తెలియడం లేదు

దానికేం నాయన – మా ఇంటికి ఓ బంధువు వచ్చినట్టుంది ఎవరో పై వారు వచ్చినట్టు లేదు, అని కామేశ్వరమ్మ అభిమానంతో అంది

మీ మంచితనంవల్లే మీ కలా తోస్తుంది

కామేశ్వరమ్మ బావగర్భితంగా బర్త వైపు చూచింది జనార్ధనయ్య గ్రహించేడు అతడికీ ఆ ఊహ తట్టక పోలేదు – గాని ప్రయోజనం ఉండదను-కున్నాడు కామేశ్వరమ్మ వత్తిడివల్ల ఆ ప్రస్తావన తేక తప్పలేదు

అబ్బాయి మోహనరావు! మేమో విషయం అడగదల్చేము నువ్వు సిగ్గు పడకండ, మనస్సులో ఏమీ దాచకుండ చెప్పాలి – ఏం?

అలాగే – అడగండి '

'మా పెద్దమ్మాయి సుభద్రను చూచేవు కదా – నీ ఉద్దేశ మేమిటి దానికి పాతికేళ్ళ వయస్సుంది స్కూలు ఫైనల్ పాసయింది

"నాయనా! అమ్మాయి చాల బుద్ధిమంతురాలు ఇంటి పనులన్ని చక్కగా చేస్తుంది భోజనం బాగా రుచిగా వండుతుంది రెండో పూట అది వండిన వంటే నేను వడ్డించే దాన్ని అనవసరంగాను, ఎక్కువగాను మాట్లాడదు తల్లిగా నేను అంత కన్న ఎక్కువ చెప్తే బాగుండదు

మా సుభద్రను నీ కిచ్చి వివాహం చేస్తే చాల బాగుంటుందని అనుకుంటున్నాము నీకు మా అమ్మాయి నచ్చితే, నీకిష్టమైతే నీ అనుమతి తీసుకుని పెద్దాపు-రం వెళ్ళి నీ తల్లి దండ్రులను కలసి మాట్లాడుదామను-కుంటున్నాను ఏమంటావు?

మోహనరావు చాల ఇరుకున పడ్డాడు పెద్దమ్మాయి సుభద్ర బాగానే ఉంటుంది గాని చిన్నమ్మాయి పార్వతి అతడ్ని ఆకర్షించినంతగ ఆమె ఆకర్షించలేక పోయింది పార్వతి కాస్త పెంకిగ, గడుసుగ, చురుకుగ

# ఇదిగో, వాడడానికి సులభమైన హేర్-డై. ఎంతో తక్కువ ధరకు.



గోద్రెజ్ పౌడర్ హేర్ డై కాంసెంట్రేట్ మీ కోసమే ప్రత్యేకంగా రూపొందించబడినది.

ఇది భారతదేశపు ఏకైక తనంతటతానే వ్యాపించే పౌడర్ హేర్ డై కాంసెంట్రేట్. అందుకే, మీరు దీనిని ఎంతో తక్కువ పరిమాణంలో వాడుకోవచ్చు!

అన్నిటికంటే ముఖ్యం, ఇది మీకు నమ్మశక్యం కానంత తక్కువ ధరకు లభిస్తుంది!



కలపడం సులభం:
కొద్దిపాటి నీటిలో పౌడర్‌ను కలపండి. అంతే, అది వాడడానికి తయారు!



వాడడం సులభం:
జుత్తుకు కాస్త పట్టించి నెమ్మదిగా లోపలికి రాయండి. అది తనంతటతానే మెత్తగా, అంతటా సమానంగా వ్యాపించి మీ జుత్తును యౌవ్వనవంతంగా చేస్తుంది!




భారతదేశపు ఏకైక తనంతటతానే వ్యాపించే పౌడర్ హేర్ డై.

Godrej

పౌడర్
హేర్ డై
కాంసెంట్రేట్

మీరు కోరే నాణ్యత. మీరు ఇష్టపడే ధర.

CLARION/GS/11/244 TEl

# కాగితపు పడవలు

ఉంటుంది ఛాయలో కూడ పెద్దమ్మాయి కన్న బాగానే మెరుగు పార్వతిని చేసుకుందుకు అతడికి అభ్యంతరం లేదు కాని ఈ విషయంలో ఆ పెద్ద వాళ్ళకు ఎలా చెప్పడమో తెలియక ఊరుకున్నాడు

అతడి మౌనానికి అర్థం గ్రహించిన కామేశ్వరమ్మ మాటను అందుకుంది – చూడు బాబు! పోనీ మా రెండవ అమ్మాయి పార్వతి నీకు నచ్చిందా దాన్ని చేసుకోడం నీ కిష్టమేనా?

మోహనరావు తలెత్తి ఆమె ముఖంలోకి చూచేడు

మీ అమ్మాయి పార్వతిని చేసుకుందుకు నా కిష్టమే కావలుస్తే మీరు మా వాళ్ళను సంప్రదించండి

చాల సంతోషం బాబు

అబ్బాయి మోహనరావు, నేను అయిదు వేల కన్న ఎక్కువ కట్నం ఇచ్చుకోలేను మీ వాళ్ళు మరి యెంత అడుగుతారో నీకేమైనా తెల్సునా?

ఖచ్చితంగా నాకు తెలియదండి కాని ఫరవాలేదు మీరు పెద్దాపురం రండి మా నాన్నగారు చాల మంచి వారు మీరు మాట్లాడవచ్చు నేను మా నాన్నగార్కి మీ స్థోమత గురించి చెప్తాలెండి

మంచిది నాయన

నేను వారం రోజులు శలవు తీసుకున్నాను ఈ వారంలో మీరు వస్తే, నేను పెద్దాపురంలో ఉంటాను

సంతోషం బాబు

ఆ రాత్రి ఏడు గంటలకు జనార్ధనయ్య భార్యతోను పెద్ద కొడుకుతోను చిన్న చర్చ జరిపేడు

పెద్ద దానికి పెండ్లి చేయక చిన్న దానికి చేస్తే పెద్దదానికి మరి పెండ్లవుతుందా? అందరూ ఏమనుకుంటారు ఏదో లొసుగుంది అందుకే పెండ్లి కాలేదు అని అపవాదు లేయరు?

అదేమిటి నాన్న? పెద్ద పిల్లకు సంబంధం కుదరలేదు – రెండవ పిల్ల కుదిరింది చేసేం – దానిలో అపవాదుకు ఏముంది? పెద్ద దానికి సంబంధం ఈలోగా చూద్దాం కుదురుతే ఈ రెండు సంబంధాలు చేసేద్దాం?

చెప్పడం సులువే – ఇన్నాళ్ళు కుదరని సంబంధం త్వరగా ఇప్పుడు దొరుకుతుందని ఎలా అనుకోడం రెండు పెండ్లిండ్లు ఒకసారే చేయగల స్థోమత మన కేది?

దానికేమిటి నాన్న మన ప్రయత్నం మనం చేద్దాం డబ్బు కంటారా ఏదో అప్పు చేద్దాం

అయితే నన్ను పెద్దాపురం వెళ్ళమంటారా?

అవునండి

ఇంట్లోని ఆడ పిల్లలు ముగ్గురికి ఈ విషయం తెల్సిపోయింది

సుభద్ర – పార్వతీ! కంగ్రాచ్యులేషన్స్

పార్వతి – నాకు సిగ్గుగాను బాధగాను ఉందక్కా నీకు కావల్సిన సంబంధం ఇలా తిరిగి పోవడం

సుభద్ర – అదేమిటే – అందులో నువ్వు చేసిందేమి లేదు ఎవరి అదృష్టం వాళ్ళది

కనకం – పార్వతక్క ఎప్పుడూ గడసుదే – మరేం మంత్రం వేసిందో

పార్వతి – ఆ మంత్రమేదో నువ్వూ వెయ్యలేక పోయేవు

కనకం – చూడక్కా నేను రంగంలోకి దిగుతే మీ వరకూ రానిచ్చేదాన్నా, ఇంతవరకు నాకు పెండ్లి కన్న ముఖ్యమైన విషయాలు సాధించవల్సినవి ఎన్నో ఉన్నాయి

ఆ మరునాడు తల్లికి వడ్డనలో సహాయం చెయడానికి సుభద్ర పోలేదు పార్వతి వెళ్ళింది

మోహనరావు వెళ్ళి పోతున్న రోజున పార్వతి ముందు వసారాలో అతడికి ఎదురైంది మోహనరావు నవ్వుతూ పల్కరించేడు –

ఏం పార్వతి చాల సిగ్గు పడి పోతున్నావు? నీకు తెల్సునా? ఇవాళే నేను మా ఊరు వెళ్ళి పోతున్నాను – మనిద్దరం మళ్ళీ ఎప్పుడు కలుస్తామో

చాల థాంక్సండి

దేనికి? నిన్ను బాధ పెట్టకుండ నేను ఊరుకు వెళ్ళి పోతున్నందులకా?

అయ్యయ్యో! దానికి కాదండి మీరు నన్ను

ఆ చెప్పు – నేను ఏం చేసేను?

పెండ్లి చేసుకుంటున్నందుకు ' అనేసి తుర్రుమని లోనికి పారి-పోయింది మోహనరావు నవ్వుకుంటూ వెళ్ళిపోయేడు

మూడు రోజుల తరువాత మంచి రోజు చూసుకుని బాగా ముస్తాబై పెద్ద కొడుకు రామారావును తీసుకుని జనార్ధనయ్య పెద్దాపురం వెళ్ళాడు

* * * * *

"ఏమిటీ! ముష్టి అయిదు వేలు కట్నంగా ఇస్తామంటున్నారా! మా వాడు మీ ఊరిలో ఈ నిర్వాకమా చేసుకుని వచ్చేడు? నాకు తెల్సండి ఈ నాటి ఎత్తుగడలు నాల్గు రోజులు అబ్బాయికి బోజనం పెట్టి, అబ్బాయిని మచ్చిక చేసుకుని రంగంలోకి దించేరు – అవునా? మీ అమ్మాయేనే వడ్డించేది?

"కామాక్షి! ఏమిటా మాటలు పెద్దా చిన్నా చూడకుండా, అని పాపం కామాక్షమ్మగారి భర్త నరసింహంగారు కేక లేసేరు

"మీరు నోరు మూసుకోండి ఈ విషయంలో జోక్యం కలుగజేసుకోకండి మీ మంచితనాన్ని ఆసరాగా తీసుకునే మీ సుపుత్రుడు వ్యవహారాన్ని ఇంత వరకు తెచ్చేడు అదిగో మాటలోనే వచ్చేడు మన పుత్ర రత్నం

"ఏమమ్మా ఏం జరిగింది? నమస్కారమండి జనార్ధనయ్యగారు ఎంతసేపయింది మీరు వచ్చి?"

గంటయింది బాబు నేను అయిదు వేలే కట్న మిచ్చుకోగలనంటే అమ్మగారు ఒప్పుకోటం లేదు

"పసివాడు వాడేం చెప్తాడు ఏంరా కంటకాపల్లిలో మాకు చెప్పకుండ నువ్వో పిల్లని యెంచుకున్నావా?

"అవునమ్మా – నేనే జనార్ధనయ్యగార్ని వచ్చి ఆ విషయమే మీతో మాట్లాడమన్నాను

"అంత పెద్దవాడవయి పోయేవన్నమాట అంతా నీ పెద్దరికమైనప్పుడు మాతో మరి మాట లెందుకు?"

"నీమీద గౌరవ ముండబట్టే అన్ని వివరాలు నీతో మాట్లాడమని అతణ్ణి మనింటికి రమ్మన్నాడు "

"అవునండి మీరెన్నైనా చెప్తారు మీరు సపోర్టు చెయ్యబట్టే వాడి కింత ధైర్యం వచ్చింది "

పాపం ఆ భర్త మరి నోరెత్తలేదు నరసింహం సబ్ రిజిస్ట్రారుగా ఇరవై సంవత్సరాలు పని చేసి ఉగ్ర నరసింహుడిలా ప్రవర్తించి రెండు చేతులా ఆర్జించి పెద్దాపురంలో ఎనభై వేలు పెట్టి ఓ చక్కని భవంతిని కట్టుకున్నాడు పైగా ఓ లక్ష రూపాయలు భార్య పేరున బాంకులో జమ చేసేడు ఇప్పుడు రిటైరయి 'రామా' 'కృష్ణా' అనుకుంటు ఓ తులసి మాలను కొనుక్కుని భక్తి మార్గంలో పడ్డాడు ఆ పుణ్యాన్ని కూడా ధనంలా రెండు చేతులా ఆర్జించేద్దామని

సర్వీసులో ఎంతటి ఉగ్ర నరసింహుడో ఇంట్లో అంతటి మెతక చెప్పాలంటే ఇంట్లో గ్రామ సింహం మాత్రమే ఆ ఇంట్లో ఎవరూ అతన్ని పట్టించు కోరు ఆ ఇంట్లో కామాక్షమ్మగారంటే అందరికీ హడలే ఇప్పుడిప్పుడే పిల్లలు పెద్ద వాళ్ళయి ఆమెకు ఎదురు తిరుగుతున్నారు అది సహించ లేక ఆ అక్కసునంతా ఆ భర్త మీద ఆమె తీర్చుకుంటుంది

**(ఇంకా ఉంది)**

# సృష్టిలో తీయనిది

— కె. కె. రఘునందన

జీవితంలో ఎందరో వ్యక్తులు తారస పడుతూంటారు ఆ వ్యక్తుల్లో కొంతమందితో బలమైన బంధం ఏర్పడుతుంది మరికొంతమంది మనుషులు మధ్యలో పరిచయమవుతూంటారు మరికొంత కాలానికే వార్ని విస్మరించటమూ జరుగుతుంది

ఇప్పటిదాకా నాకు చాలా మందితో పరిచయం ఏర్పడింది కొంత మందితో అది ప్రగాఢ స్నేహానికి దారి తీసింది

ఏ కొద్దిపాటి పరిచయమున్నా అంతులేని సఖ్యతను పెంచుకొనే నా మనస్తత్వానికి పూర్తిగా సరితూగే మనిషి ఒక్క శివతేజ మాత్రమే! ఇతరుల మాటలకు, అసూయతోనో, ఉడుక్కొనో, కోపంతోనో – గిల్లి కజ్జాలు పెట్టుకునే వాడుకాదు శివతేజ

కొన్ని కొన్ని విషయాల్లో మేమిద్దరం వాదులాడుకున్నా – మళ్ళా మరుక్షణంలోనే క్షీర నీరాల్లా కలసి పోయే వాళ్ళం

బ్రతుకులో తీయని స్మృతి పరిమళమైన స్నేహానికి కమ్మని గుర్తు శివతేజ

అసలు శివతేజ ప్రసక్తి ఇక్కడ తేవటం ఎందుకో చెప్పవలసిన తరుణం రానే వచ్చింది

శివతేజ చలన చిత్ర రంగంలో ప్రముఖ సినిమా హీరోగా వెల్గొందుతున్నవాడు అతని సినిమాలంటే మెచ్చుకోని ప్రేక్షకుడు ఈ ఆంధ్ర దేశంలో లేడనే చెప్పాలి! అన్ని విషయాల్లో పరిపూర్ణతను పెంచుకున్న ఉత్తమ నటుడు

శివతేజ ముందు నాటకాల్లో వేసేవాడు అప్పట్లో నేను నాటకాలు వ్రాసే వాడ్ని నా రచనలు అప్పుడే పత్రికలలో చోటు చేసుకుంటున్నాయి అయితే నేను వ్రాసే నాటకాలకు ఎక్కువ ప్రోత్సాహం, ఊపిరి ఇచ్చినవాడు శివతేజ మాత్రమే! మిగతా నటులకు ప్రచురించబడిన నాటికలు, లబ్ధ ప్రతిష్టుల విరచితాలైన నాటకాలు అయితే పరిషత్తుల్లో బహుమతి గెల్చుకోవచ్చనే దురభిప్రాయం ఒకటుండేది అది నా రచనా ప్రగతికి కొంతకాలం అవరోధంగా వుంటూ వచ్చింది

అయినా వాట్ని అన్నింటినీ అధిగమించి నన్ను ఉత్సాహ పరచి, మంచి రచయితగా వెలుగులోకి తెచ్చినవాడు శివతేజ

ఒకసారి నాటిక తయారు చేసాను దానికి పి వి రమణయ్య మేష్టారి దర్శకత్వం రోజూ రాత్రిపూట మహా రాజ కాలేజీలో రిహార్సల్స్

నెల రోజులు తర్ఫీదు పొంది విజయనగరం వాస్తబల్ హాల్లో జరిగే పరిషత్తు పోటీల్లో పాల్గొన్నాం మా నాటిక గ్రాండ్ సక్సెస్ అయింది శివతేజ ఉత్తమ నటుడి బహుమతి కొట్టేశాడు నాటిక రోలింగ్ షీల్డ్‌ని గెల్చుకుంది

నా పదునైన ఆలోచనలకు ప్రతి రూపం అయిన ఆ నాటిక నాకు మరింత పేరు ప్రతిష్ఠలను సంపాదించి పెట్టింది చాలామంది ఆ స్క్రిప్ట్‌ని అడిగి పట్టుకెళ్లారు

అలా ఎన్నోసార్లు నేను నాటిక తయారు చేయటం – రమణయ్య మేష్టారు దర్శకత్వం వహించటం – శివతేజ ఉత్తమ నటుడిగా విజయం పొందటం జరిగింది

ఇలా ఉండగా ఒక రోజు హడావుడిగా మా యింటికి వచ్చాడు శివతేజ –

'ఒరే! ఇన్నాళ్ళకు నా కృషి ఫలించిందిరా! నా నటనకు గౌరవం, గుర్తింపు – ఈనాటికి లభించిందిరా!" అన్నాడు నన్ను చూడగానే

నాకు వాడి మాటల్లో విషయం అవగాహన కాలేదు

అడిగితే చెప్పాడు వివరంగా –

ఒరే! నువ్వు తయారు చేసిన నాటిక 'బ్రతుకు బాటలో భాష్ప ధారలు'కు బహుమతి వచ్చిన సంగతి నీకు తెల్సుగా' దానికి న్యాయ' నిర్ణేతగా వ్యవహరించిన ప్రముఖ సినీ దర్శకుడు 'కేసరి' గారు నా నటన తనకు నచ్చాయంటూ, వ్రాసి, త్వరలో తాను తీయబోయే క్రొత్త చిత్రంలో ఓ ముఖ్య పాత్ర యిస్తానని – అర్జంటుగా రమ్మని వ్రాసాడు ఈరోజే నా ప్రయాణం మా నాన్న, అమ్మ అభ్యంతరం చెప్పలేదు నువ్వు – మిగిలిన మన మిత్రులు స్టేషను కొచ్చి నన్ను దిగబెట్టాలి" అన్నాడు ఆనందాతిరేకంగా

అదృష్టం తలుపు తట్టడమంటే యిదేనేమోననిపించింది

శివతేజ ఉప్పొంగిన సంతోషం నాలోనూ ఉప్పొంగింది

ఇన్నాళ్ళుగా వున్న వాడి నటనాకుసుమం పుష్పించి గుభాళించబోతూందన్నమాట

శివతేజ బాగా ఉన్నవాడు కావటం – తల్లి దండ్రుల ప్రోత్సాహం దానికి తోడు కావటంతో వెళ్లడానికి సంసిద్ధుడైనాడు

ఆ సాయంత్రం వాడ్ని రైలెక్కించటానికి – నేను ముఖ్య మిత్రులమైన మధు, ఇందూ రమణ, ఎమ్వీవి వెళ్ళాం

దూరమవుతున్నందుకు వాడి కళ్లల్లో కదలాడిన కన్నీటి సుడి మేమంతా గమనించాం!!

'అరే నువ్వెంతో ఆనందంగా ఉండవలసిన సమయమిది అలా కనీళ్ళు పెట్టుకుంటావేం!' "ఎమ్వీవి ధైర్యం చెప్పాడు

"డబ్బు తగలేసి సినిమాల్లో చేరిపోదామని మద్రాసు పరిగెడుతున్నారు చాలామంది అలాకాక కోరి అదృష్టం వరించబోతూంటే అలా డీలా పడిపోతావేం!' అన్నాడు ఇందూ రమణ

"నాకూ ఆనందమేరా! కాని మన ఫ్రెండ్స్ సర్కిల్‌తో అంతా విడిపోతున్నాననే ఆవేదన తప్ప మరేం లేదు ఉత్తరాలు రాస్తూండండి!

రుమాలుతో కళ్ళు తుడుచుకుని అన్నాడు

"ఒరే మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించినా మమ్మల్ని విస్మరించవుగా!" హాస్యంగా అన్నాను వాడు సీట్లో సర్దుకున్నాక

వాడు చిరునవ్వు నవ్వి – ఒరే సర్దాకైనా ఆ మాటనకు మీరు అందరూ నాకు ఆప్తులురా! అని కిటికీలోంచి అందరి చేతుల్ని ఒక్కోసారి ఆప్యాయంగా నొక్కి వొదిలాడు

రైలు కూత పెట్టి పరుగు తీసింది

తర్వాత వాడు రక రకాల వేషాలు వేసి సినీమా రంగంలో ప్రముఖ నటుల జాబితాలో అనతి కాలంలోనే చేరిపోయాడు క్రొత్తలో మేం వాడికి ఉత్తరాలు వ్రాయడం – వాడు మాకు జవాబు లీయటం జరిగింది రాను రాను షూటింగ్‌ల ఒత్తిడి వలన వాడినుండి ఉత్తరాలు రాకలకు పూర్ణ బిందువు పెట్ట బడింది మేం ఈమధ్య కాలంలో మద్రాసు వెళ్ళటం కాని – వాడు మా ఊరు రావటం కాని కాలేదు

తర్వాతర్వాత మేమంతా ఉద్యోగ రీత్యా ఎవరికి వారే యమునా తీరే అయినాం! అయితే మళ్లా ఇంత కాలానికి – వాడు మా నగరం విచ్చేస్తున్నాడన్న వార్త పేపర్లో పడగా – నేను చదవటం జరిగింది అందువలననే ఆద్యంతం గతంలో మునిగి తేలాను

ఊళ్లో ఎక్కడ పడితే అక్కడ పోస్టర్స్ అంటించారు ప్రముఖ నటుడు శివతేజను – అభిమాన సంఘం వారు సన్మానం జరుపుతున్నట్లు ప్రచారం కూడా చేస్తున్నారు మైకుల్లో

ఊరంతా కోలాహలంగా ఉంది ఎక్కడ చూసినా శివతేజ ప్రసంగమే!

అందరికన్నా నా కెక్కువ ఆనందం, గర్వం కలిగాయి అంతటి ఉన్నత నటుడు నా బాల్య స్నేహితుడన్న విషయం స్ఫురణకు వచ్చిన ప్రతీ

క్షణం నాఎదపై మధురానుభూతుల సుమ వర్షం కురిసేది వేయి వెన్నెలలు వెల్లి విరిసేవి

శివతేజ రాగానే – అందర్నీ తప్పించుకుని వాడ్ని కరువుతీరా కౌగలించుకుని – 'ఏరా వెధవా' అంటూ ఒక్క తిట్టు తిడితే కాని నా పులకించిన మనసు శాంతించదు



అమ్మో! అంత మందిలో అగ్ర నటుడ్ని తిడితే అంతా తనని పిచ్చివా డనుకుంటారు పోలీసులు ఉతికి పారేస్తారు

ఇంతకీ – శివతేజ నన్ను గుర్తిస్తాడా!?

అనాటి స్నేహ పరిమళం యింకా అలాగే గుబాళిస్తూంటుందా! ఆ చల్లని చెలిమితో చలువతన మలాగే ఉంటుందా!?

ఎందుకుండదూ! తప్పకుండాతనని గుర్తిస్తాడు!! వాడు నన్ను ఎంతో అభిమానిస్తాడు ఆప్యాయంగా మాట్లాడుతాడు

ప్రక్కనున్న అభిమానుల సంఘం వారికి ఇంటర్వ్యూ అయినా యివ్వకుండా తనతోటే లోకమౌతాడు అప్పుడు వాళ్ళంతా నేనెంత తొందరగా లేచిపోతానని ఎదురు చూస్తూంటారు ఆ నిముషం నా నర నరాలలో 'శివతేజ నా మిత్రుడు' అన్న గర్వం ప్రకటిస్తుంది

ఉదయంనుండీ నా మనసు మనసులో లేదు గుబులు గుబులుగా ఉంది ఒక విద్యార్థికి పరీక్ష బెల్లు వినిపించగానే సీట్లోకి వెళ్ళేటప్పటి భావన

ఒక నిరుద్యోగి – ఇంటర్వ్యూకి వెళ్ళే ముందు – ఏం ప్రశ్నలు వేస్తాడో నన్న గాబరా

అచ్చం నాహృదయం కూడా అలాగే అయ్యింది

సాయంకాలమౌతూండగా నా ఆఫీసు మిత్రులందర్నీ తీసుకుని శివతేజను చూడ్డానికి బయలుదేరాను

చిన్నతనంలో శివతేజ, నేను ఏవిధంగా కలసి మెలసి తిరిగి వున్నదీ విపులంగా చెప్పాను వారికి

వాళ్ళంతా నన్నెంతగానో అభినందించారు శివతేజలాంటి అగ్ర నటుడు నాకు బాల్య స్నేహితుడవటం గర్వించదగ్గ విషయంగాపేర్కొన్నారు

మే మలా మాట్లాడుకుంటూ సంగీత కళాశాల వైపు వెళ్తుంటే ఎవరో పిలిచినట్లయి వెనక్కి తిరిగి చూసాను.

"ఒరే! రాంబాబూ!" – ఆశ్చర్యం ఓ రిక్షావాడు నన్నొరే అనిపిలుస్తున్నాడు!!

మిత్రులంతా ఆగారు.

ఒక్కసారి వాడి చెంప ఛెళ్ళుమనిపిద్దామనుకున్నాను. నలుగురిలో ఓ రిక్షా వెధవచేత ఒరే అనిపించుకోవడమా!

నా అణువణువూ ఆవేశం.

వాడు నన్ను సమీపించాడు.

"ఏరా! రాం బాబూ! గురు లేనా!" పల్కరించాడు వాడు.

వాడి ఆకారం అపరిచితంగా అనిపించింది.

మిత్రచయం నా వైపు వింతగా చూసింది.

నా తల నరికేసినట్లయింది.

"నేను నువ్వు అరటి చెట్ల బడిలో చదువుకున్నాం. నేన్రా! అబ్బుల్ని.... రాజమ్మ మనవణ్ని.... మీరు జిడ్డు వారి వీధిలో ఉండేవారు కదా!" అంటూ గతం గుర్తు చేయడానికి ప్రయత్నించాడు.

వాస్తవానికి నా కాక్షణం వాడెవడో తెలిసింది.

శివతేజ, నాతో పాటు, వాడు కూడా తిరుగుతుండేవాడు.

అంతస్తులు వేరైనాయి తప్ప అంత రంగాలు ఒక్కటే!వాడికి సెకండ్ హాండ్ బుక్స్ కొనటం, పరీక్ష ఫీజులు కట్టడం చేసే వాడ్ని.

కొంతకాలానికి వాడి తల్లి చనిపోవటం – కుటుంబం వీధిన పడ్డం.... చదువు ఆగిపోవటం... ఒకదాని వెంట ఒకటి జరిగి పోయాయి.

ఇప్పు డిలా రిక్షా ఈడుస్తూ బ్రతు కీడుస్తున్నాడన్న మాట!!

"రాంబాబు! నిన్ను చూసి చాలా కాలమైంది! బాగున్నావా!!" ఆప్యాయంగా ప్రశ్నించాడు వాడు.

వాడెంత అభిమానం కురిపిస్తున్నా – అది నా మిత్రుల ముందు అవమానకరంగా తోచింది.

## 'కాలం'

మెరుస్తూ
మురిపిస్తూ
తన ఉనికికి
అన వాళ్ళైనా
మిగల్చకుండా
కళ్ళెదుటే
జారిపోయే
ప్రమాదకరమైన
పాదరసం

—సుహాసిని

## సృష్టిలో తీయనిది

"ఎవరోయ్ రాంబాబు! నిన్నొరే అనే ఈ రిక్షా వెధవ కూడా నీ చిన్నప్పటి మిత్రుడే నన్నమాట. శివతేజలాంటి అగ్ర నటుడేనని గర్వపడ్డాం!! "ఒక మిత్రుడు విట్టు వేసాడు.

ఘొల్లున నవ్వారంతా.

"నా కెవరో తెలీదు.... అయినా యిలా నడి రోడ్డుమీద నన్ను చూసి ఎవరో అనుకుంటున్నాడు...." నా స్నేహాన్ని మంట గలిపేసి.... మానవత్వానికి గోరీ కట్టి అన్నాను.

"ఎవడ్రా నువ్వు! మా రాం బాబుని పట్టుకుని 'ఒరే అన్నంత చనువు నీ కెక్కడిదిరా! రాస్కెల్" అని వాడి షర్టు పట్టుకుని చెంప పగుల గొట్టాడు మిత్రుడు రామారావు.

వాడు రెండు చెంపలూ పట్టుకుని బిక్కు బిక్కుమని చూస్తూ నడి రోడ్డుమీద ఉండిపోయాడు.

మేం కదిలాం

అమ్మయ్యా! గుండెల్నిండా ఊపిరి పీల్చుకున్నాను పరువు దక్కింది ఇటువంటి వాడు నా స్నేహితుడని చెప్పుకోడానికి సిగ్గు చేటు కూడాను

సంగీత కళాశాల చేరుకున్నాం

శివతేజ ఎక్కడ వున్నదీ కనుక్కొని వస్తానని నే నొక్కడినే ముందుకు వెళ్ళాను ఆ సరికే జనం అతని గది బయట గుమి గూడి ఉన్నారు వార్ని అదుపులో పెట్టడానికి పోలీసులు ప్రయత్నిస్తున్నారు లారీలతో అదిలిస్తున్నారు

శివతేజను చూడబోతున్నానన్న వెర్రి ఆనందంతో తల మునకలౌతున్న నాతో ఒక్కసారి బలం పుంజుకుంది జ్ఞానాన్ని తోసుకుని లోనికి దూరాను దేవుడి దయవల్ల నాకు తెల్సిన ఓ పోలీసు కనిపించాడు విషయం చెప్పాను

లోనికి వెళ్ళడానికి అనుమతించాడు

సంతోషాతిరేకంతో నా గుండెలు దడ దడ లాడాయి

గదిలోకి అడుగు పెట్టేసరికి శివతేజ సోఫా మీద కూర్చుని విలాసంగా సిగిరెట్టు కాలుస్తున్నాడు అతని భుజంపై తల ఆనించి నవ్వుతూ మాట్లాడుతోంది ఓ అందాల భామ

అనవసరంగా, ఇటువంటి సమయంలో అడుగు పెట్టానా అనిపించింది సందిగ్ధావస్థలో కొట్టు మిట్టాడుతున్న నన్ను శివతేజ చూడటం– గబుక్కున లేవటంతో – నన్ను గుర్తించి పలకరించడానికి అనుకున్నాను

"ఎవరది? ఇంత ధైర్యంగా నా రూమ్‌లోకి అడుగు పెట్టే ధైర్యం నీ కెలా వచ్చింది అపాయింట్‌మెంట్ యివ్వనిదే ఎవర్నీకు ఎంట్రిన్స్ యిచ్చారు సెక్రటరీ " శివతేజ స్వరంలో విసుగు, అసహ్యం స్పష్టంగా బహిర్గతమౌతున్నాయి

అయితే శివతేజ నన్ను పోల్చలేదన్నమాట

నిజానికి శివతేజ అందం నన్ను క్షణం మంత్ర ముగ్ధుణ్ని చేసింది యాపిల్ పండలా నిండుగా అందంగా మెరిసి పోతున్నాడు రింగు రింగుల జుత్తు ఆ అందానికి మరింత వన్నె తెస్తూంది

"ఎవరయ్యా! నువ్వు ఏమిటి అలా వెర్రి వాడిలా చూస్తున్నావ్" వాడి గొంతు విని నే నీ లోకంలో పడ్డాను

"శివతేజా! ఒరే నేన్రా! రాం బాబుని" చెప్పాను

నా కున్నుల్లో ఒక్కసారి ఆనంద భాష్పాలు అప్రయత్నంగా నిలిచాయి

"రాంబాబా! ఎవరూ! నీకు తెలుసా డియర్ ఆ వయ్యారి అడుగుతోంది శివతేజను

నాకు అటువంటి వాళ్ళెవరూ లేరో నవ్వాడు వాడు

శివతేజా! మనం ఈ విజయ నగరంలో అరటి చెట్ల బడిలో చదువుకోలేదా! మనం హస్టల్‌లో నాటికలు వేసేవాళ్ళం నేను రాసిన నాటిక వేసేకదా ని

ఇటీవల నెల్లూరులో శ్రీ అక్కినేని షష్ఠిపూర్తి మహోత్సవ సందర్భంగా జరిగిన పాటల, నృత్య పోటీలలో ఉత్తమ గాయనిగా ఎన్నికైన కుమారి రాధికారాణికి బహుమతినందజేస్తున్న శ్రీ జె. కె. రెడ్డి, జానపద నృత్యంలో ప్రథమ బహుమతి పొందిన కుమారి పద్మ జిల్లా అడిషినల్ జడ్జి శ్రీ ఇ. వెంగళరెడ్డిగారి నుంచి బహుమతి స్వీకరిస్తున్న దృశ్యం, నెఫ్జా అధ్యక్షుడు సుందరరామిరెడ్డిని కూడ చిత్రంలో చూడవచ్చు.



కీ సినిమా చాన్స్ వచ్చింది ఇంకా ఆనాటి ఛీ ఛీ గుర్తులు వివరించాను

ఎవడో పిచ్చోడిలా గున్నాడు వీడివల్ల నాకు సినిమా ఛాన్సా! వికటంగా నవ్వాడు శివతేజ

శృతి కలిపింది ఆ వయ్యారి

నా నవ నాడులూ కృంగిపోయాయి కళ్ళు బయర్లు కమ్మ సాగాయి

సెక్రటరీ! సెక్రటరీ! వీ డెవడో పిచ్చి పిచ్చిగా వాగుతున్నాడు బయటకు గెంటెయ్యి ' ఆజ్ఞాపించాడు శివతేజ

కలుసుకున్న యిన్నాళ్ళకయినా – రూపం మారినా మనసు మారని ఒకప్పటి మిత్రుడ్ని చూడాలన్న నా కోర్కె నాలోనే అణగారి పోయింది

వాడి మాటలు నా గుండెలపై సమ్మెట దెబ్బ లైనాయి కళ్ళల్లో అనుకోకుండా నీళ్ళు నిండి పోయాయి

సృష్టిలో అపూర్వమైన స్నేహానికి గొప్ప నిర్వచనం చెప్పావురా! కసిగా అనుకున్నాను

సెక్రటరీ బయటకు గెంటకుండానే బరువుగా అడుగు లేస్తూ వచ్చేసాను

బయట జనం తో పూలాట మొదలైంది

ఆ జన సముద్రంలో పోలీసులు నా మిత్రులకు ముఖం కనిపించకుండా జాగ్రత్త పడుతూ బయటకు వస్తున్న సమయంలో – ఎదురుగా ఎర్ర టోపీ

నా ముణుకులపై వరుసగా లారీ దెబ్బలు

బాధతో విలవిల్లాడి స్పృహ కోల్పోయాను

* * *

నా కళ్ళు విడివడేసరికి నే నొక గుడిసెలో ఉన్నాను

అయ్యో! నాకేమైంది! నే నెక్కడున్నా నేమిటి? నాలో నేను కలవరిస్తుంటే లోపలనుంచి ఒక ఆకారం నా ముందుకు వచ్చింది

ఎదురు వచ్చి నతన్ని పోల్చాను

ఎవరినైతే స్నేహితుల ముందు అవమానించానో శివతేజ ఆకర్షనలో, తపనలో ముత్తులో ఎవరినైతే విస్మరించానో వాడే అబ్బులు

లారీ దెబ్బలతో స్పృహ తప్పిన నన్ను ఇక్కడికి చేర్చి

## కేన్సర్ వ్యాప్తిని నిరోధించే కొత్త మిశ్రమం!

కేన్సర్‌వ్యాధి కణాలు శరీరంలోని యితర ప్రదేశాలకు వ్యాపించకుండా నిరోధించే మిశ్రమాన్ని ప్రయోగశాలలో విజయవంతంగా రూపొందించినట్లు విశ్వవిద్యాలయ ఔషధ సంస్థకు చెందిన ప్రొఫెసర్ కునియె నకజిమా వెల్లడించారు

స్పిరిమిడైన్ అనే మిశ్రమం కేన్సర్ కణాలలో అధిక సంఖ్యలో ప్రత్యేకించి వేగంగా అభివృద్ధి చెందే కణాలలో కనిపిస్తుంది ఈ కేన్సర్ కణాలు యితర భాగాలకు వ్యాపించటానికి స్పిరిమిడైన్ చాలావరకు కారణమని వెల్లడైంది ప్రొఫెసర్ నకజిమా పరిశోధక బృందం 243 మిశ్రమాల సంయోగం చేసింది వీటిలో 129 మిశ్రమాలలో 0.01 మిల్లిమో స్పిరిమిడైన్ కార్యకలాపాలను 90 శాతం వరకు నిరోధించగలదు

ప్రొఫెసర్ నకజిమా ప్రయోగశాలలో ఎలుకలపై ఈ మందుతో ప్రయోగాలు నిర్వహించినప్పుడు వాటికి బాగా నిద్రమత్తు కలిగింది ఈ స్వల్ప దుర్గుణాన్ని కూడా పోగొట్టేలా ఔషధాన్ని తయారు చేయగలమని నకజిమా అంటున్నారు

(జ వా)

రక్షించాడు జరిగిన సంఘటన తలుపు కొచ్చి నా మనసుపై మానని గాయమై బాధించింది పశ్చాత్తాపంతో హృదయం కృంగి పోసాగింది

హిమాలయ శిఖరం వాడైతే – పరమాణువు నేను

ఏమండీ రాంబాబూ! నేను సినిమా హీరోని చూద్దామని వచ్చాను ఇప్పటికే మీరు స్పృహ తప్పి పడిపోయి వున్నారు జనం తొక్కుకుని వెళ్ళిపోతే మీ ప్రాణాలే పోయి ఉండేవి వెంటనే మా యింటికి తీసుకొచ్చాను ఆ పరిపూర్ణమైన మానవత్వం హృదయంలో నిండుదనం చెలిమిలో చలువదనం – మూర్తీభవించిన మాటలవి

అయితే వాడు 'ఏమండీ' అని సంబోధించటంతో నా ఎద సన్నగా మూల్గింది

'నన్ను క్షమించండి రాంబాబూ! చిన్నప్పటి స్నేహాన్ని పురస్కరించుకొని చనువుగా పిలిచాను మీ మిత్రుల మధ్య మీకు అవమానం జరిగితే అది నా తప్పే! ఆ సమయంలో మీరు నన్ను తిట్టినా నేను బాధ పళ్ళేదు తెలుసా! మీ పరువు కోసం మీ రలా అన్నారని నాకు తెలుసు అని తిరిగి నన్ను క్షమించమన్న వాడి ఉన్నత సంస్కారం – వాడిపై నాలో ఎనలేని అభిమానాన్ని ఏర్పరిచింది

ఒరే! అబ్బులూ! ఏమండీ' అని పిలిచి యిప్పటికే కృంగిపోతున్న నన్ను యింకా చంపకురా! ఒకప్పుడు ప్రేమగా పిలిచిన పిలుపు 'ఒరే' అనే పిలుపురా! నిన్ను అవమానించినందుకు క్షమించురా! నా గుండెల్లో ఒక్కసారి గూడు కట్టుకున్న అభిమానం వెల్లువైంది

"ఒరే! రాం బాబూ! ఆత్మీయంగా పిలిచిన ఆ పిలుపు అమృతంలా నా మదిని తాకింది

ఒరే అబ్బులూ పరవశంగా పిలిచాను

క్షణంపాటు మైమరచి కౌగలించుకున్నాం

ఒరే నా యింట్లో పంచ భక్ష్య పరమాన్నా లుండవు అందుకే నీ కోసం హోటల్ కెళ్ళి క్యారేజి భోజనం తెస్తాను' అని బయటకు వాడు వెళ్తుంటే – నా కసలు మాటలే కరువైనాయి

శివతేజ – నన్ను విస్మరించడని – ఎంతగానో అభిమానించి మాట్లాడతాడని – వాడి స్నేహం యింకా పరిమళిస్తూనే ఉంటుందని అనుకున్న నాకు తెలిసింది –

వాడి మైత్రి దూరపు కొండల నునుపని!

నలుగురిలో నేను వాడ్ని అసహ్యించుకున్నా – క్రూరంగా, వాడ్ని విస్మరించినట్లు నటించి – వాడి మదిని తీవ్రంగా నొప్పించినా – స్పృతి తప్పిన నాకు సపర్యలు చేసి – సహృదయంతో గౌరవించి – చిన్న నాటి మిత్రుడిగా అభిమానించిన వాడి గురించి తెలిసింది – అబ్బులు చెలిమి – చల్లని కొలనని – □

# వ్యక్తిగతం



సెప్టెంబరు 15న లండన్ లోని కెన్సింగ్టన్ పాలస్‌లో జన్మించిన తమ కనిష్ఠ పుత్రుడు ప్రిన్స్ హెన్రీని ఎత్తుకుని ఉన్న రాజకుమారి డయానాని బొమ్మలో చూడవచ్చు



చెకోస్లోవేకియా కవి జారెస్లావ్ సీఫెర్ట్‌కి ఈ ఏడాది సాహిత్యంలో నోబెల్ బహుమతి లభించింది ప్రాగ్‌లోని ఒక ఆసుపత్రిలో ఉన్న ఈయనకి ఈ బహుమతి వచ్చిన విషయాన్ని తెలియచేసినప్పుడు తీసిన ఫోటో ఇది ఈయన వయస్సు 83 సంవత్సరాలు



కుమారి ఆయేషా కాప్టన్ (21) భారత దేశంలో జాకీగా లైసెన్స్ పొందిన మొట్ట మొదటి మహిళ పూనాలో ఈమధ్య జరిగిన గుర్రపు పందేలలో ఈమె స్వారీ చేసిన గుర్రం మూడోదిగా వచ్చింది జాకి వృత్తిని స్వీకరించిన ఈమె ముఖ్యంగా తన బరువు పెరగకుండా చూసుకోడం కోసం ఆహార నియ మాలని తు చ తప్పకుండా పాటిస్తున్నట్లు ఆదివారం రాత్రిపూట మాత్రమే తృప్తిగా భోజనం చేస్తున్నట్లు చెప్పారు జాకీ లైసెన్స్ తనకి ఇవ్వడానికి రేస్ క్లబ్‌వారు తటపటాయించారని జాకీల గదిలో ఒక భాగాన్ని తన కోసం ప్రత్యేకంగా కేటాయించ వలసి రావడం కూడా అందుకు ఒక కారణం అని ఆమె అన్నారు




## 16-11-1984 శుక్రవారం మొదలు 22-11-1984 గురువారం వరకు

★ **మేషం :** అన్ని విధాలా అనుకూలం. అంటె ముఖ్య గ్రహానుకూలం మూర్తులు కూడా మంచివే వ్యాపార విస్తరణ ప్రయత్నాలు మేలుగా ఉంటాయి ఏదో వ్యాపార విషయం కూడా వారాంతంలో పరిష్కారం కానున్నది స్త్రీలకు విలువ గల వస్తు సేకరణకు అవకాశం గల వారం

★ **వృషభం :** చాల కాలంగా తనఖా పడిన వ్యవహారం సానుకూలం కాగలదు విద్యా వైజ్ఞానిక రంగాన చాలమందికి అనుకూలం పోగొట్టుకొన్న వస్తువులో, ధనమో దొరుకగలదనే ఆశ కనిపిస్తుంది స్త్రీలకు నూతన వస్తు సేకరణకు అనుకూలం గ్రహించేది

★ **మిధునం :** సరి సమానులతో తగాదాలు రాగలవు ప్రత్యర్థులతో మనస్పర్థలు ఏర్పడగల అవకాశాలుంటాయి, తగాదా తంటాలుండగలవు జాగ్రత్త! స్త్రీలకు అత్యవసరంగా ప్రయాణాలుండగలవు, కాని సాధ్యమైనంతలో ఆపుచేకోవటం శ్రేష్ఠం ప్రశాంతతకు మార్గం

★ **కర్కాటకం :** ఆదాయమున్నది వ్యాపారం సలక్షణంగా సాగిపోయే అవకాశాలున్నాయి వ్యవహార రీత్యా యిది అనుకూలమైన వారంగా గ్రహించాలి వృత్తియందు పెంపు, ఉద్యోగంలో రాణింపునకు అవకాశమున్నది స్త్రీలకు గృహోపకరణాలు సేకంచుకొనుటలో, నూతన వస్తువులు సంపాదించుకొనుటలో వారం గడుస్తుంది

★ **కన్య :** శుభ కార్యాలోచనలతో, తర్జన భర్జనలతో నూతన వస్తు, వస్త్ర సేకరణతో కాలం జరిగిపోతుంది ఎన్ని విధాలా ఆలోచించినా మీకు ఉత్తమ ఫలదాయక వారమే, గ్రహానుకూల్యత గల వారం స్త్రీలకు నూతన బంధుత్వం సమకూడుట, ఆశించిన 'ప్రమోషన్' అందగలదనే వార్త వినుట సంభవం

★ **తుల :** కొన్ని అనానుకూలాలు జరుగుతాయి కొన్ని వ్యవహారాలలో మీకు అపకారమే జరుగుతుంది రాశియందు స్థితుడైన 'శని' గ్రహం ఎంత పని చేయడు, జాగ్రత్త వహించాలి స్త్రీలకు : ఆహార వ్యవహార, ఉద్యోగ, వ్యవహారాదులందు జాగ్రత్తపడాలి

★ **వృశ్చికం :** మీతో తగాదాపడే వారుంటారు చుట్టుప్రక్కలవారితో అనవసరమైన పేచీలుండగలవు అనవసరమైన ప్రయాణాలుంటే మానుకోవటం శ్రేష్ఠం వ్యాపార రీత్యా ఏమైనా మేలైన దినంగాదు స్త్రీలకు ఉద్యోగ వృత్తులందు ప్రగతి కనిపిస్తుంది డబ్బు చేతికి అంది, అవసరాలు తీరుతాయి గ్రహించండి

★ **ధనుస్సు :** చాల కాలంగా యత్నించి నెరవేరలేదనే ఒకానొక గృహ విషయంలో సొంతంగా, సమగ్రంగా మీకు అనుకూలత చేకూరగలదు అయినవారి నుండి వసూలు కావలసిన ద్రవ్యాన్ని గూర్చి ఆయాసపడకండి వసూలయ్యే వారంగా గ్రహించండి స్త్రీలకు బాధ్యతగల వ్యవహారాలు పెనవేసికొని యిబ్బంది పడుతారు

★ **మకరం :** మీరు కట్టదలచిన యిల్లుగాని నూతనంగా ప్రారంభింపదలచిన వ్యాపారంగాని ఈ వారంలో సానుకూలం కాగలదనే వార్త వింటారు ధనాదాయమున్నది రంగస్థల నటులకు కధకులకు గాయకులకు, గాయనీమణులకు చక్కని అవకాశాలు లభిస్తాయి స్త్రీలకు ఆప్తులకు అనుకూలత లేని వార్తలు వినటం, అనుకొనని ప్రయాణాలుండటం గ్రహింపగలరు

★ **కుంభం :** ప్రజలతో బాగా సన్నిహితంగా ఉండేవారికి, అధికారుల అనుగ్రహానికి పాత్రులయినవారికి, రాజకీయరంగానుభవంగల వారికి చక్కని అవకాశాలు లభిస్తాయి ప్రయాణ మూలక ఆదాయం కూడా కొందరి విషయంలో చెప్పదగిన అంశం స్త్రీలకు నూతన వస్తు ప్రాప్తి, ఉద్యోగాభివృద్ధి సంభవం

★ **మీనం :** రెండు మూడు విధాల మీకు లాభించే మార్గమున్నది చాల కాలంగా నెరవేరని ఒకానొక వ్యాపార విషయం సానుకూలం కాగలదు వ్యవహార రీత్యా మీకు మేలైన వారంగా గ్రహించి మెలగాలి స్త్రీలకు రాజకీయంగా మేలు, వస్తు సేకరణకు అవకాశం కించిత్తు ఆదాయం లభించగల వారం గ్రహించి శ్రమించండి

**—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి**

# అంతా కాంతిమయం. అంతా సౌందర్యమయం.
# అదే హెచ్ ఎమ్ టి మహాత్మ్యం.

మంచి వెలుగులో చూడండి.
హెచ్ఎమ్‌టీకి మారిపోండి.
మీరు ఊహించలేనంత కఠినంగా
నాణ్యత పట్టి చూచే సంస్థ హెచ్ఎమ్‌టి.
అందుకే, ఒక్కొక్క హెచ్ఎమ్‌టి
లాంపులోకి వెళ్లే ఒక్కొక్క విడిభాగమూ
హెచ్ఎమ్‌టీయే స్వయంగా తయారు
చేసుకుంటుంది.

ఆఖరుకు ఈ లాంపుల్ని తయారుచేసే
యంత్రాలు కూడా హెచ్ఎమ్‌టి
తయారు చేసినవే.

హెచ్ఎమ్‌టి పేరు తెచ్చుకోవాలంటే
ప్రతీ లాంపూ 75 కఠిన పరీక్షలలో
నెగ్గి అర్హత పొందవలసిందే.
అందుకే ఆ ఆధిక్యత కనిపించేది.
ఆ వెలుతురులో. ఆ మన్నికలో.
హెచ్ఎమ్‌టి. ఎప్పటికైనా మెరుపులాంటి
ఎంపిక !

హెచ్ఎమ్‌టి బల్బులు,
ఫ్లోరసెంట్ ట్యూబులు.




మీ జీవితంలో
వెలుగు.

Sista sHMT/80/84 Tel

ధారావాహిక

# దేదీప్య

## కంచుమర్తి వెంకటేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

## 20

వారం రోజులూ పిల్లలకు ప్రాక్టీసు ఇవ్వడం తోనే సరిపోయింది దేదీప్యకు శివప్రసాద్ ఇంటికి వెళ్ళడం జరిగింది కాదు అప్పుడప్పుడు రిహార్సల్ టైములో స్కూలుకు వచ్చేది శిల్ప

ఆరోజు స్కూలు ఏనివర్సిడే!

సాయంత్రమయ్యేసరికి పిల్లలతో, పిల్లల తల్లి తండ్రులతో, గెస్టులతో కళకళలాడుతుంది స్కూలు మీటింగ్ అయింతర్వాత సాంస్కృతిక కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి

తెర తీయగానే స్టేజిమీద కనిపించిన దృశ్యం అది ఒక ఉద్యానవనం.పూలమొక్కలతో అందంగా వుంది ప్రకృతి మాత కదిలివస్తుంటే స్వాగతగీతం అనిపించింది స్వాగత మందుకున్న ప్రకృతి మాత కదులుతుంటే తెర వెనుక నుండి నవ్వులు వినిపించాయి అటువైపు తరలివెళ్ళింది ప్రకృతమాత

గులాబీలు, మల్లెపూవులు నేను గొప్ప, నేను గొప్పంటూ గట్టిగా వాదించుకుంటున్నాయి అవి తనలో తాము వాదించుకుంటూ అక్కడకు వచ్చిన గడ్డిపూవును చీదరించాయి.

గులాబి, మల్లె గడ్డిపూవును గేలిచేసాయి

గడ్డిపువ్వు దీనంగా అడుగుతుంది మీ స్నేహం తనకూ ఇవ్వమని

గడ్డిపూవును క్రిందకు తోసాయి గులాబి, మల్లె

గులాబీ, మల్లెల పరిహాసాలు

గడ్డిపూవు దీనాలాపన

విన్న ప్రకృతి మాత గుండె జలదరించింది వారి మధ్యకు వెళ్ళింది.

''పూచే పువ్వులన్నీ సమానమే. ఏమొక్కకు పుట్టిన, ఏ కొమ్మన ఎదిగినా ప్రతి పూవు పరమాత్ముని పాద సన్నిధి చెంతకే ఎవరు గొప్ప? ఎవరు తక్కువ ? బేధాలు లేవు.'' అని ప్రకృతి మాత ముగ్గురిని గుండెలకు హత్తుకుంది

తరువాత బాల బాలికలు తమలో ఎన్ని మతాలు వారున్నా, ఎన్ని కులాలు వారున్నా ఆ బేధాలు మాలో లేవు కలసి ఆటలు ఆడుతాం, ప్రగతి పాటలు పాడుతాం, కులమతాలకు అతీతమైన వ్యవస్థగా రూపొంది దేశ అభ్యుదయానికి కృషి చేస్తాం అంటూ శపధం చేస్తుండగా తెర పడింది.

**జరిగిన కథ—6 :** బలరాం, పార్వతమ్మల రెండవ కూతురు దేదీప్య. స్కూల్లో అక్క పోలికలతో ఉన్న పాపను చూస్తుంది దేదీప్య. ఏడేళ్ళ క్రిందట ఇల్లువదిలిన అక్క అవంతిని గురించి తెలుసుకోవాలనే ఆశతో శిరీషకు ట్యూషన్ చెప్పను అంగీకరిస్తుందామె. శిరీష అవంతి కూతురా! కాదా! అని తెలుసు కోవాలని తహతహలాడుతోంది దేదీప్య. స్నేహితురాలు సరళతో సినిమాకెళ్ళిన దేదీప్యకు సినిమా హాల్లో శిరీష, శివప్రసాద్‌లు కలుస్తారు. శిరీష తల్లి పేరు ప్రతిమ అని తెలుసుకున్న దేదీప్య అయోమయంలో పడుతుంది. సరళ తన కథను దేదీప్యకు చెప్పసాగింది. చిన్నతనంలోనే సరళకు ఆమె బావ రాఘవతో వివాహం జరిగింది. బావకు తనంటె ఇష్టం లేదని తెలుసుకొన్న సరళ కుమిలిపోతుంది సరళ తన కథంతా దేదీప్యకు చెప్పి తన భర్త ఫొటో చూపించింది తన మేనమావ కూతురు శిల్ప వస్తోందని తెలుసుకొన్న శివప్రసాద్ మనసంతా గందరగోళం అవుతుంది. తన చదువయిపోగానే నవీన్‌ను పెళ్ళి చేసుకొంటానని సుస్మితతో చెపుతుంది శిల్ప. దేదీప్య పెళ్ళి కుదరదు

ఐకమత్యాన్ని చాటించే పూలబాల రూపకం అందరిని సంతోషపరిచింది పిల్లల అభినయం చూడ్డానికి ఎంత అందంగా వుందో, కథ చెబుతూ పాటలు పాడిన దేదీప్య తీయని కంఠం వినడానికి ఆనందంగా వుంది

దేదీప్య తియ్యని స్వరానికి ముగ్ధుడయ్యాడు శివప్రసాద్

హెడ్‌మిస్ట్రెస్ రూపకంలో పాల్గొన్న బాలికలకు బహూమతులు ప్రకటించగా ముఖ్య అతిధిగా వచ్చిన జిల్లాకలెక్టర్ బహుమతులను అందజేసారు

హెడ్‌మిస్ట్రెస్ దేదీప్యపాటలను మెచ్చుకుని వేదిక మీదకు పిలువగానే తడబడే అడుగులతో వేదిక మీదకు వచ్చిన దేదీప్యను చూసిన చాలా కళ్ళు మెరిశాయి గులాబీరంగు చీరలో అందంగా వున్న దేదీప్యను చూసిన శివప్రసాద్ కళ్ళల్లో ఏవో భావాలు చెలరేగాయి

ప్రోగ్రాం అయింతర్వాత సుస్మిత, శిల్పలతో బయటకు వచ్చింది దేదీప్య

''మీరు ఇంత బాగా పాడతారని ఎప్పుడూ చెప్పలేదేమిటి!'' అడిగింది శిల్ప

''దేదీప్యగారూ మీ పాటకు అభినందనలు'' శివప్రసాద్ అలా అనగానే దేదీప్య 'నాకు కాదా' అంది గబుక్కున

ఆ మాటకు అందరూ నవ్వేసారు

## 21

ఆదివారం

దేదీప్య శివప్రసాద్ ఇంటికెళ్ళేసరికి వరండాలో శిల్ప, సుస్మిత, శివప్రసాద్ పేకాట ఆడుతున్నారు

''రండి దేదీప్యగారూ మా బావ మా ఇద్దరినీ ఓడించేస్తున్నాడు. గెలుపు ఎప్పుడూ మగవాడిదేనని మీసం త్రిప్పుతున్నాడు'' అంది దేదీప్యకు కూడా ముక్కలు వేస్తూ.

వరుసగా రెండు ఆటలు దేదీప్య గెలిచింది శివప్రసాద్ చురుగ్గా చూసాడు దేదీప్యను దేదీప్య చిన్నగా నవ్వింది

''మా ఇద్దరినీ అమాయకులను చేసి గెలిచావు బావా. దేదీప్యగారితో ఆడి గెలుపు సాధించు చూద్దాం'' అంది శిల్ప

''అంటే దేదీప్యగారితో పోటీలో గెలవలేనంటావు'' ఉక్రోషంగా అన్నాడు శివప్రసాద్

''బెట్ ఏ విషయంలో కూడా దేదీప్యగారితో గెలవలేవు'' అంది శివప్రసాద్‌ను మరింత ఉడికిస్తూ.

''రైట్ అంత గట్టిగా చెప్పుతున్నావు కాబట్టి పవెం వేసి ఆడుదాం. దేదీప్యగారిని పెద్ద ప్లేయరవనుకుంటున్నావు ఎప్పటికైనా దేదీప్యగారిని నేనే గెలుస్తాను''

శివప్రసాద్ మాటలకు చురుగ్గా చూసింది దేదీప్య

అతని మాటల అర్థం ఆటలో మునిగి పోయిన సుస్మిత, శిల్ప గ్రహించలేకపోయారు

ఇంతలో ఆయా కాఫీలు తీసుకొచ్చింది.

కాఫీలు త్రాగింతర్వాత శిల్ప ముక్కలు పంచింది

సుస్మిత, శిల్ప, శివప్రసాద్ ప్రక్కన దేదీప్య కూర్చున్నారు.

నలుగురు సీరియస్‌గా ఆడుతున్నారు

మొదటి షో చూపించింది దేదీప్య.

శిల్ప కౌంట్ వేస్తుంది

దేదీప్య ముక్కలు పంచుతుండగా ఆగమన్నాడు శివప్రసాద్.

''బెట్ గురించి మాట్లాడకుండా ఆడడం ఏం బాగాలేదు.''

''అయితే బెట్ వివరాలు నేను చెబుతాను మీరందరూ షరతులకు అంగీకరించాలి'' అంది సుస్మిత

సరేనన్నారందరూ.

''సరే వినండి మొదటి రౌండులో ఓడిపోయిన వాళ్ళు సినిమాకు తీసుకెళ్ళాలి. రెండో రౌండులో ఓడిపోతే హోటలుకు తీసుకెళ్ళాలి. ఇక చివరి ఘట్టంలో పరాజయం పొందితే పెద్ద పనిష్మెంట్ మిగిలిన ముగ్గురిని పిక్నిక్ తీసుకెళ్ళాలి ఓకే''

సుస్మిత బెట్ వివరాలకు అందరూ అంగీకరించారు కానీ దేదీప్య ఆలోచనలో పడింది

''ఏమిటి మీరింకా ఆలోచిస్తున్నారు''అంది శిల్ప.

''పందెం చాలా ఖరీదైనదిలా 'అనిపిస్తుంది'' అంది నెమ్మదిగా దేదీప్య.

''ఏం ఫరవాలేదు. మీరు తప్పకుండా గెలుస్తారు. దేదీప్యగారూ. ఒక సంఘటన చెప్పనా, ఒకసారి మా కాలేజీ వాళ్ళంతా పిక్నిక్ వెళ్ళాం. గ్రూపులుగా విడిపోయి ఆటల్లో పడ్డాం. లాటరీపద్ధతిలో గ్రూపులుగా ఏర్పడ్డాం ఒక గ్రూపులో ఇద్దరమ్మాయిలు, ఇద్దరబ్బాయిలు. ఆటలో పందెం వేసుకున్నారు. ఆఖరి రౌండులో ఓడిపోయిన వాళ్ళు విజయం సాధించిన వారి బుగ్గపై ముద్దు పెట్టుకోవాలి. ఆ అమ్మాయిలు ముందు భయపడ్డారు మరి తప్పదు ఆట సీరియస్‌గ ఆడడం ప్రారంభించారు.

ఏ అమ్మాయి ఓడిపోయి తనకు ముద్దును బహుమతిగా ఇస్తుందా యని ఆ ముద్దు కోసం అబ్బాయిలిద్దరూ సీరియస్‌గ, శ్రద్ధగ ఆడడం ప్రారంభించారు అబ్బాయిని ఎక్కడ ముద్దు పెట్టుకోవలసి వస్తుందో అని, ఈ గండం నుండి తప్పించుకోవాలని ఇద్దరమ్మాయిలు పట్టుదలతో ఆడేరు. ఎవరి ఆతృత వారిది. ఆట జోరుగా సాగుతుంది మొదటగా ఒక అబ్బాయి ఓడిపోయాడు ముద్దు ఛాన్సు తప్పిపోయిందని దిగాలు పడిపోయాడు. ఆ అబ్బాయి మిగిలిన గ్రూపులవాళ్ళ దగ్గరకు వెళ్ళి పందెం గురించి చెప్పగానే తమాషా చూద్దామని అందరూ ఆ ముగ్గురి చుట్టూ మూగేరు ఆటలో ఉన్న అమ్మాయిలిద్దరికీ భయం పట్టుకుంది. అయినా ఆటమీద శ్రద్ధను పోనివ్వలేదు.

రెండో రౌండులో ఒక అమ్మాయి ఓడిపోయింది. బ్రతుకు జీవుడా యని ఊపిరి పీల్చుకుంది ఆ అమ్మాయి

రంగంలో ఉన్నారు అమ్మాయి, అబ్బాయి

బాగా ఆడమని, ఓడిపోవద్దని మిగిలిన అమ్మాయిలు ఆ అమ్మాయికి ధైర్యం చెబుతున్నారు. అబ్బాయిలు మరింత హుషారుగా ఆటలో ఉన్న అబ్బాయికి ఎంకరేజ్ ఇస్తున్నారు'' అని ఆగిపోయింది శిల్ప

''తర్వాత ఏమైంది ''

శివప్రసాద్ అడిగాడు ఇంట్రెస్టుగా

సుస్మిత ముసిముసిగా నవ్వుతూ వింటుంది. కానీ దేదీప్య తలవంచుకుంది

''పాపం. ఆ అమ్మాయి ఓడిపోయింది అబ్బాయిలు ఈలలు వేస్తూ గోల చేస్తున్నారు ఆ అమ్మాయి బిక్కు బిక్కుమంటూ చూస్తుంది ''ముద్దు పెట్టాలి'' అని



అబ్బాయిలు గోల. ఆ అబ్బాయి విజయగర్వంతో ఆ లమ్మాయి యిచ్చే ముద్దు కోసం ఎదురు చూస్తున్నాడు.

మరి ఎప్పదన్నట్లుగా ఆ అమ్మాయి నెమ్మదిగా ఆ అబ్బాయి దగ్గరకు వెళ్ళి చిన్నగా అబ్బాయి బుగ్గమీద ముద్దుపెట్టింది అందరూ ఆ అబ్బాయిని మీదకు ఎత్తేసారు

ఆ ముద్దు సంఘటన ఆ రోజుతో అందరూ మరచిపోయారు. ఎందుకంటే మెడికల్‌కాలేజీలో జరిగే రేగింగ్, పెదపెద్ద విషయాలతో పోలిస్తే ఇది చాలా చిన్న విషయం అయితే అందరూ ఆశ్చర్యపోయే విషయం ఏమిటంటే ఆ ముద్దు సంఘటనతో ఆ అమ్మాయి ప్రేమలో ఆ అబ్బాయి పడడం, ఆ అమ్మాయి కూడా ఆ అబ్బాయిని ప్రేమించడం జరిగింది పెళ్ళి కూడా చేసుకోవాలనుకుంటున్నారు ''

శిల్ప చెప్పడం అవగానే శివప్రసాద్ చప్పట్లు కొట్టాడు

''వండర్‌ఫుల్. పందెం అంటే అలా గుండాలి మా అక్క ఆటలో ఉంది కాబట్టి సరిపోయింది లేకపోతేనే ఆ పందెం మనం వేసుకుంటే బాగుంటుంది'' అన్నాడు అప్రయత్నంగా

''అబ్బ ఆశ'' అంది శిల్ప వెక్కిరిస్తూ

దేదీప్య ముఖం ఎర్రబడింది.

''మీరు కథలు చెప్పకుంటారా, ఆట ఆడుతారా'' సుస్మిత గట్టిగ అనడంతో ఆటలో పడ్డారు

శిల్ప ముక్కలు పంచింది

తర్వాత శిల్ప ఓడిపోయింది

కౌంట్ ఎక్కువడంతో దేదీప్య కూడా ఓడిపోయింది

అక్కా, తమ్ముళ్ళిద్దరే రంగంలో మిగిలారు

పిక్నిక్ అంటే మాటలా, ఖర్చుతో కూడినది.

# ''దే దీ ప్య''

గెలుపు కోసం సీరియస్‌గ ఆడుతున్నారు.

శిల్ప సుస్మితకు, దేదీప్య శివప్రసాద్‌కు సలహాలిస్తూ ఆట నడిపిస్తున్నారు

సుస్మిత వేసిన ముక్కను తీసుకుని మరో ముక్క వేయబోతుంటె దేదీప్య శివప్రసాద్‌ను వారించి ఇంకో ముక్క వెయ్యమని చొరవగా అతని చేతిలోని ముక్క తీస్తుంటే దేదీప్య చేతులు అతని చేతులను తాకాయి

అప్రయత్నంగా శివప్రసాద్ దేదీప్య చేతులను పట్టుకున్నాడు

చురుగ్గా చూసింది దేదీప్య

''థేంక్స్'' అన్నాడు నవ్వుతూ

ఆటలో మునిగిపోయిన శిల్ప, సుస్మిత ఇదేమీ గమనించలేదు

సుస్మిత ఆట చూపించడంతో ఇద్దరూ కౌంటుకు దగ్గరయ్యారు

డ్రాప్ ఛాన్సు లే . . . రికీ

''ఈసారి జాగ్రత్తగా ఆడాలి లేకపోతే ఓటమి తప్పదు''

అనుకున్నారు అక్కా, తమ్ముడు

జోకర్‌తో ఆట చూపించి పందెం గెలిచాడు శివప్రసాద్

''అక్కా పందెం నేనే గెలిచాను పదెం ప్రకారం తమ తమ షరతులను అమలు పరచడానికి అక్క డేట్ ఫిక్స్‌చేస్తుంది అందుకు మీరంతా సిద్ధంగా ఉండాలి'' అన్నాడు శివప్రసాద్.

సుస్మిత నవ్వుతూ చెప్పింది

''మొదటగా ఓడిపోయిన శిల్ప వచ్చే ఆదివారం సినిమాకు తీసుకువెళుతుంది సినిమాకు వెళ్ళే దారిలో రెండో రౌండులో ఓడిపోయిన దేదీప్యగారు హోటలుకు తీసుకువెళతారు ఇక చివరిసారిగ పరాజయం పొందిన నేను పిక్నిక్‌కు తీసుకెళతాను. పిక్నిక్ ఎక్కడోకాదు మా ఊరు తీసుకువెళ్ళి, తిరుగు ప్రయాణంలో రామప్ప చూపిస్తాను. కాబట్టి నేను వెళ్ళేటప్పుడు నాతో మీరంతా రావాలి'' అంది

శిల్ప, శివప్రసాద్ ఒప్పకున్నారు

''ఏమిటి దేదీప్యగారూ అంతగా ఆలోచిస్తున్నారు. హోటలు బిల్లు గురించి భయపడకండి చాలా తక్కువ తింటాం'' అంది శిల్ప.

సుస్మిత, శివప్రసాద్ నవ్వేసారు

''చాలా టైమయింది మరిక వస్తానండి'' అని లేచింది దేదీప్య.

'కారులో డ్రాప్ చేస్తాను' అని ఆగిపోయి 'సారీ' అన్నాడు శివప్రసాద్

సుస్మిత, శిల్పలకు అర్థం కాలేదు

దేదీప్య బయటకు వచ్చి రిక్షాను పిలిచింది

## 22

ఆదివారం సాయంత్రం దేదీప్య వెళ్ళేసరికి సుస్మిత, శిల్ప తయారై కూర్చున్నారు శివప్రసాద్ బూట్లు వేసుకుంటున్నాడు ఆయా శిరీషను తయారుచేసి తీసుకొచ్చింది

నలుగురూ కారులో కూర్చున్నారు

హోటలు ముందు కారాపి దేదీప్యను చూసాడు శివప్రసాద్

దేదీప్య నవ్వుతూ కారు దిగింది

ఫామిలి రూంలో కూర్చున్నారు

సర్వరుకు ఆర్డరివ్వబోయి శివప్రసాద్ ఆగిపోయాడు.

''బిల్లు మీది కాబట్టి మీరే చెప్పాలి'' అన్నాడు

''ముందు స్వీటు చెప్పండి'' అంది సుస్మిత

''గులాబ్‌జాం''

దేదీప్య, శివప్రసాద్ ఒక్కసారే అనడంతో సుస్మిత, శిల్ప నవ్వుకున్నారు.

''మీ ఇద్దరి అభిరుచులు ఒకటే కాబట్టి మీరు ఏది చెప్పినా తినడానికి సిద్ధం'' అంది శిల్ప.

దేదీప్య మాట్లాడలేదు

స్వీటు, దోశ తిన్న తర్వాత శిరీషకు బోర్నవిటా చెప్పి నలుగురూ కాఫీలు చెప్పారు

ఎందుకో అనుమానం వచ్చి హేండ్‌బేగ్ చూసుకుంది దేదీప్య

గుండె జల్లుమంది

స్కూలు కెళ్ళేటప్పుడు రెండు రూపాయలు కంటే ఎక్కువ బేగ్‌లో వేసుకునే అలవాటు లేదు పార్టీ సంగతి గుర్తున్నా డబ్బు వేసుకుని రావడం మరచిపోయింది.

ఇప్పుడెలా ?

సుస్మిత, శిల్ప ఏమనుకుంటారు ?

ప్రక్కన కూర్చున్న శివప్రసాద్ దేదీప్య అవస్థనంతా గమనిస్తున్నాడు



దేదీప్య బిక్కపోయి చూసింది.

సుస్మిత, శిల్ప వాష్ బేసిన్ దగ్గరకు వెళ్ళారు. శివప్రసాద్ పర్సులోంచి ఇరవై రూపాయల నోటు తీసి ఎవరికీ కనిపించకుండా దేదీప్య చేతిలో ఉంచాడు.

కృతజ్ఞతా పూర్వకంగా చూసింది దేదీప్య.

బిల్లు చెల్లించి బయటకు వచ్చి కారులో కూర్చున్నారు.

సినిమా హాలు దగ్గర కారు ఆగింది.

శిల్ప టిక్కెట్లు తీసింది.

శిల్ప, సుస్మిత, దేదీప్య ప్రక్కన శిరీషను కూర్చోబెట్టి తర్వాత శివప్రసాద్ కూర్చున్నాడు సినిమా ప్రారంభమైంది.

శిరీషకు ముందుసీట్లో పెద్ద మనిషి ఉండడంవలన కనిపించడం లేదు.

'డాడీ... కనిపించడం లేదు' అంది శిరీష

శివప్రసాద్ శిరీషను తనసీట్లోకూర్చోబెట్టి శిరీష సీట్లోతను కూర్చున్నాడు.

దేదీప్య ప్రక్కన శివప్రసాద్.

సినిమా మధ్యలో కుర్చీ హేండిల్ మీద చేయి వేసాడు. అప్పటికే ఆ హేండిల్ మీద దేదీప్య చేయి ఉంది.

దేదీప్య చేయి మీద శివప్రసాద్ చేయి.

షాక్ కొట్టినట్లయింది దేదీప్యకు.

ఆ చేతిని అతను తీసేస్తే బాగుండునను కుందేగాని దేదీప్య తన చేతిని తీయాలనిపించ లేదు.

శివప్రసాద్ దేదీప్య చేతిని మృదువుగా నొక్కాడు.

మత్తుగా ఉంది

ఏదో తీయని అనుభూతి

దేదీప్య చేయి సన్నగా వణికింది

శివప్రసాద్ దేదీప్య చేయిని గట్టిగా నొక్కి

## "దే దీ ప్య"

వదిలేశాడు

తత్తరపడింది

దేదీప్య అతనివైపు చూసింది

చీకటిలో అతని పెదవులపై చిరునవ్వుల వెన్నెల కనిపించింది.

దేదీప్య శిల్ప, సుస్మితలను చూసింది వాళ్ళు సినిమాలో లీనమయ్యారు

ఇంటర్వెల్‌లో శిల్ప సుస్మిత బయటకు వెళ్ళారు. దేదీప్యతో మాట్లాడ్డానికి ఇదే అవకాశమనుకున్నాడు శివప్రసాద్

"దేదీప్యగారూ"

అతనివైపు చూసింది దేదీప్య

"దేదీప్యగారూ నాతో మీరు మాట్లాడ్డానికి భయపడుతున్నారు కారణం తెలుసుకోవచ్చా నేను రాక్షసుడిలా కనిపిస్తున్నానా."

ఈసారి కూడా దేదీప్య మాట్లాడలేదు

"ప్లీజ్ చెప్పండి."

అతనితో మాట్లాడాలి అతనికి చేరువవ్వాలి.

వయసు అతనివైపు మొగ్గుతున్నా మనసు మాత్రం ఒక విషయం గురించి అతనికి ఎదురు తిరుగుతుంది.

శిరీష .

అక్క ..

శిరీష అక్క కూతురా, కాదా? ఈ నిజం తెలుసుకోవాలి. అక్క గురించి తెలుసుకోనిదే ఆలోచనలను మరోవైపు మళ్ళించకూడదని నిర్ణయించుకుంది.

కలలు, కలవరింతలు, తలపులు, తలంపులు ప్రేమ వైపు పరుగులు తీస్తుంటె, ఆ ప్రేమ లోని అనుభూతిని ఆస్వాదించాలని వయసు తహ తహ లాడుతుంటె ఏ ఆడపిల్ల శూన్యంలోకి చూస్తూ కూర్చుంటుంది.

దేదీప్య కూడా ఆ కోవకు చెందినదే

కాని...

అక్క గుర్తుకొచ్చినప్పుడల్లా ఆలోచనలు అటు మళ్ళేవి.

అక్క ఎక్కడుంది ?

అక్క పోలికలున్న శిరీష కనిపించగానే శిరీష అక్క కూతురైతే బాగుండును. అక్క ఎక్కడుందో తెలుస్తుంది అనుకుంది అదే దేదీప్య ఆశ

ఒక ప్రక్క శివప్రసాద్, అతని మాటలు, చూపులు తనను చేరువ కావాలని ప్రయత్నిస్తున్నాయని గ్రహించింది దేదీప్య

శివప్రసాద్‌ను డాడీ అంటుంది శిరీష.

శిరీష నిజంగా అక్క కూతురైతే

అతను తన కేమవుతాడు

అక్క భర్త

అక్క శివప్రసాద్ భార్య అయితే అతను ఎందుకు ఒంటరిగా ఉంటున్నాడు ?

అక్క ఎక్కడుంది ?

అన్నీ చిక్కు ప్రశ్నలుగా తయారయ్యాయి దేదీప్యకు

అతనితో మాట్లాడాలని శరీరంలోని అణువణువు ఉవ్విళ్ళూరుతుంది

కాని

శిరీష, అక్క, అమ్మా, నాన్న ..

తన చుట్టూ వలయంలా ఉన్నారు

ఈ సమయంలో తను ప్రేమలో పడితే.

అక్క దూరమైందని ఆ బాధ నుండి ఇంకా అమ్మా, నాన్న తేరుకోలేదు తను మళ్ళీ ఈ వలయంలో చిక్కుకుంటే, ముందు ముందు ఏదైనా జరిగితే వాళ్ళు తట్టుకోగలరా.

ఈ సమయంలో తన నిర్ణయం చెప్ప కూడదు

బయట పడకూడదనుకుంది

"నామీద కోపమా"

శివప్రసాద్ మాటతో వాస్తవానికి వచ్చింది

అతనికి జవాబు కావాలి ఆ కళ్ళల్లో నిరీక్షణ.

"మీ మీద కోపంలేదు"

ఆ ఒక్క మాట అంది దేదీప్య

శివప్రసాద్ కళ్ళల్లో వెలుగు, పెదవులపై చిరునవ్వు.

దేదీప్య తల వంచుకుంది.

ఇంతలో బయట నుండి శిల్ప, సుస్మిత లోపలకు వచ్చారు

శిరీష దేదీప్య ఒడిలో నిద్రపోయింది

సినిమా అయింతర్వాత దేదీప్యను ఇంటి దగ్గర డ్రాప్‌చేసి వెళ్ళిపోయారంతా.

**(ఇంకా ఉంది)**

ఇటీవల రాష్ట్రంలో మొదటిసారిగా కరీంనగర్ ఫిల్మ్ సొసైటీ కరీంనగర్‌వారు సముపార్జించుకొన్న 35 ఎం ఎం ప్రొజెక్టర్‌లను ప్రారంభిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీ ఆర్ చంద్రశేఖర్, జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీ కె సాయిరెడ్డిని కూడా చిత్రంలో చూడవచ్చు






## సి.హెచ్. జి. ఆర్. – టిట్లాఘర్

ఆవేదనతో రాజీ పడడం కేవలం మనస్సుని సంతృప్తి పరచడమే గాని తుడిచి పెట్టడానికి కాదని నా నమ్మకం?

★ ఎవరేనా చేసేది చేయకల్గినదీ అంతే! మనస్సుకి తగిలినగాయం మానదు కాలం కాస్త దాన్ని కప్పుతుంది అంతే

## సి. హెచ్. ఎస్. – నల్లగొండ

నేను ప్రేమించి పెళ్ళి చేసుకుందామని అనుకుంటున్నాను కాని నా మీద యింటి బాధ్యతలు వున్నాయి నేను ఏమి చేయాలి?

★ బాధ్యతలు కట్నం పుచ్చుకో-మంటున్నాయా?!

## జి. ఏ. ఆర్. – మెట్టూరు

మొదటి ప్రేమ ప్రేమకులకు బాగానే వుంటుంది కాని లాస్టున విడగొడు-తుంది ఎందువలన? యిందువలనే ప్రేమ అంటే నాకు అసహ్యం

★ మంచిది – పెళ్ళికి ప్రేమకి సంబంధం లేదు మన సమాజంలో అంచేత భార్యని ప్రేమించే డేంజరు పని చేయక అసహ్యించుకుంటూ కాపురం చేయండి – ఆనందరావు గారూ! మీరు సిసలైన సినిక్‌లాగా వూహిస్తున్నారు

## టి. ఎమ్. – బెల్లంపల్లి

నేను ఒక కవిత రాసాను మీకు పంపు-తాను ప్రచురిస్తారా? తిప్పి పంపుతారా?

★ ఎక్కడ ప్రచురించమంటారు? నాకో పత్రిక వుందనుకుంటున్నారేమిటి కొంపతీసి! యీ వస్తున్న వాటి జోరు చూసి

## ఎమ్. వి. ఆర్. – పెదనింద్ర

కథకు యింకొకళ్ళు పెట్టుకున్న పేరు పెట్టుకోవచ్చా?

★ కథలకీ – తమ పేర్లు పెట్టు-కుంటున్న రోజులు యివి! పేరు కేంటి? ఇలా మంచి నవల పేరు రాగానే – అలా సినిమా టైటిలుగా రిజిస్టరు చేసు-కుంటున్న ప్రబుద్ధులున్నారు కూడా

## ఒక అభాగ్యుడు – కేశవరం

నా తండ్రి బాధ్యత కల ఉపాధ్యాయ వృత్తిలో వుంటే, చివరిలో మమ్ములను విడిచి యింకో పెళ్ళి చేసుకొనుటకు నిశ్చయించినాడు అందరు మమ్ములను అపహాస్యం చేస్తున్నారు

★ ధైర్యంగా వుండి – లాయరును సంప్ర-దించండి – భార్య వుండగా మళ్ళీ పెళ్ళి చేసుకోవడం – సాగనిస్తే ఏమోగాని – లేకపోతే అంత సులభం కాదు

## జి. ఎ. – భువనేశ్వర్

తన కూతురికి 30 ఏళ్ళ లో వున పెళ్ళి యోగం లేదని ముందు ప్రయత్నాలు చెయ్యలేదు తండ్రి ఇప్పుడు 38 ఇంకా సంబంధం కుదరలేదు ఆశ కూడా లేదు ఏం నమ్మకాలో ఈ రాకెట్ యుగంలో కూడా?

★ పెళ్ళి కొడుకులు కంప్యూటరు ఇంజనీర్లు, జియోఫిజిసిస్టులు, ఏవేవో చదువుకునీ కుజ దోషాలు గుమ్మడి కాయలూ అనడం లేదూ? యీ పిచ్చి చదువుకున్న వారిలో మరీ ముదురుతోందని-పిస్తోంది నాకు మీరామెమీద జాలి ప్రదర్శించి ఆమె నింకా అవమాన పరచకండి పెళ్ళి కానంత మాత్రాన కొంప మునిగిపోదు ఆ మాటకొస్తే యీ మధ్య ఆడపిల్లల సంగతి అటుంచండి – అబ్బాయి-లనే యిలా వేధించి పారేస్తున్న తల్లి తండ్రు లుంటున్నారు!

## జె. బి. ఆర్. – మొగులపల్లి

డబ్బులు తీసుకుంటుంది కళావంతుల చిన్నది విషాదంగా వస్తుంది ముందుకు – ఎందుకో కాసిని కన్నీళ్ళు – ఎందు-కంటారు?

★ మనసు అసహ్యించుకునే పని డబ్బు కోసం శరీరం చేయవలసి రావడం వల్ల

హృదయ వనంలో ప్రేమ తీగ వాడిపోతే తరవాత మళ్ళీ చిగురిస్తుందా?

★ చేసే దోహదాన్ని పట్టి వుంటుంది – ఫలితం

## ఎ. ఎస్. డి. ఏ. – మద్రాసు

అమ్మాయిలకు కట్నం యివ్వకూడ-దంటారు కదా! అమ్మాయికి వచ్చే అబ్బాయి కట్నం కావాలంటే – ఏం చేస్తారు? లేకుండా ఎవరూ చేసుకోకపోతే యిస్తారా?

★ వేరే సంబంధం చూసుకో-మంటాము డబ్బు కోసం పెళ్ళాడే కుర్రాళ్ళు నాకే కాదు నా పిల్లలకి కూడా నచ్చరు

సంసారంలో దిగే కంటే సముద్రంలో దిగవచ్చును అంటారు పెద్దలు – ఎందు-కండి?

★ సముద్రంలో ఎప్పుడు మునుగుతా మన్నది కాస్త తెలుస్తుంది ముందు సంసారంలో అదీ తెలియదు! □



# సినిమా -జి. వి. జి.




**ఈ పిల్ల ఎవరో నాకు మాత్రం ఏంతెల్సు?**
**"సినిమాలో వేషం అడగటానికి వచ్చింది!**

## నవ తారలతో దాసరి "బ్రహ్మ ముడి"

"కుర్ర తనంలో ఆకతాయితనంగా తీసుకునే నిర్ణయాలకు, సాంప్రదాయాలకు జరిగే సంఘర్షణ.... వాస్తవంగా జరిగిన ఒక సంఘటన ఆధారంగా ఈ చిత్రాన్ని రూపొందిస్తున్నాను. రజని హీరోయిన్. హీరోగా జయసుధ సోదరుడు త్రినాథ్, విలన్‌గా చక్రవర్తిని ఎన్నుకున్నాం. ఇంకా నర్సాపూర్, నిడదవోలు కళాశాల ప్రొఫెసర్స్ రామచంద్రరావు, శ్రీరామచంద్ర, ఆకాశవాణిలో పని చేసే నండూరి విఠల్, కిశోర్, నాగశాయి, సత్యంలు కూడా పరిచయం గావింపబడుతున్నారు" అన్నారు దాసరి నారాయణరావు. ఆయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వ బాధ్యతలు వహించే లక్ష్మి భార్గవి చిత్ర వారి "బ్రహ్మముడి" చిత్రం షూటింగ్ విజయదశమి-నాడు తారక ప్రభు కాంప్లెక్స్‌లో మొదలైంది. చంద్ర-శేఖర్ స్వరకల్పనలో దాసరి, సి. నారాయణరెడ్డి, కొసరాజు గీతాలు రాశారు. కె. ఎస్. హరి ఛాయ, కె. ఎల్. ధర్ శిల్పం, బండెల ఈశ్వరరావు సహ దర్శకత్వం, కృష్ణ కూర్పు. సూరపనేని రాధాకృష్ణ నిర్వహణతో సీతా రామయ్య, రంగబాబు నిర్మాతలు. నవంబర్ 10 వరకు జరిగే రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది.

## "5 లక్షలు"లో లక్షలకందని అందం!

ఓ అమ్మాయి అందానికి ముగ్ధుడై, చిరు నవ్వుకు బందీయై ఆ అందాన్ని సొంతం చేసుకోలేని తన జీవితం వృధా అనుకున్నాడొక అమాయకుడు. లక్షలతోనే ఆ లక్ష్యం సాధ్యమని భ్రమపడ్డాడు. ఆ అందం దగ్గరయినా లక్షల కోసం ఆరాటపడ్డాడు. ప్రాణాలకే తెగించాడు- మరెన్నో ప్రాణాలు గాలిలో కలిసి పోతుంటే భయపడ్డాడు.- ఎలాగైతేనేం బయట పడ్డాడు. ఆ లక్షలు ఎవరికీ కాకుండా పోయాయ్. లక్షల కందని ఆ అందం వసుంధర ఎంటర్‌ప్రైజెస్ "5 లక్షలు"లో సుమలతదే- ఆ అందాన్ని అందుకోటానికి ఆరాటపడి, ఎన్నో రహస్యాలను ఛేదించిన సాహసవంతుడెవరో కాదు ప్రతాప్‌పోతన్. సంభ్రమాశ్చర్యాలుగొలిపే అతని అభినయం అద్భుతం. డైరెక్టర్ రాజ భరత్ శక్తి సామర్థ్యాలతో, అణువణువునీ కదిలించిన శంకర్ గణేష్ సంగీతం సరిదీటనిపించుకుంది. యువ నిర్మాత జగదీష్ తొలి చిత్రంగా జయకృష్ణ సమర్పిస్తున్న యీ "5 లక్షలు" చిత్రానికి ప్రశాంత్ నిర్వహణ బాధ్యతలు వహించారు.



సుమలత, "5 లక్షలు"

"అమ్మాయి మనసు"లో చంద్రమోహన్, శరత్‌బాబు



# భలే బేరం!

ఒక అందమైన
స్టీలు గిన్నె కేవలం
రూ.2.25 లకు



ఈ
విధమైన
3
సబ్బులతో




ACIL/0838/84-Tel



సూపర్ పవర్

# రీగల్

మురికిని నిర్మూలిస్తుంది
బట్టలను కాపాడుతుంది




షా వాలెస్ వారి
విశిష్ట ఉత్పాదన

సూపర్ పవర్ రీగల్ బహుమతి లేకుండాను లభించును

కథా నాయకుడు బాలకృష్ణ

## సురేష్ అధినేత
## డి. రామానాయుడు చిత్రాలు

ముందు కథా నాయకుడు ఆ తర్వాత "శ్రీకట్న లీలలు" అనంతరం మాంగల్య బలం చిత్రాలు వరుసగా విడుదల లవుతాయని నిర్మాత డి రామా-నాయుడు అక్టోబర్ 11 న పాత్రికేయుల సమావేశంలో తెలిపారు "కథా నాయకుడు శ్రీకట్న లీలలు" చిత్రాల నుంచి కొన్ని పాటలు ప్రదర్శింపబడ్డాయి "శ్రీకట్నలీలలు కు రచన దర్శకత్వ బాధ్యతలు వహించే పరుచూరి సోదరులలో ఒకరైన గోపాలకృష్ణ "రాకెట్ యుగంలోకి వచ్చినా రాతి యుగం నాటి దురాచారాలు కొన్నింటిని మానవుడు ఇంకా విడలేక పోతున్నాడు వాటిలో అందర్నీ పీడించేది వర కట్న

## సినిమా

పిశాచి ఇందుకు పరిష్కార మార్గంగా మొదట ఉన్నత వర్గంలో మార్పు రావాలి ఇలా పై నుంచి సరుక్కు వస్తే గాని మధ్య తరగతి వారిలో చివరి తరగతి వారిలో మార్పు తేలేం ఈ సూచనను సున్నితమైన హాస్యం మేళవించి సరదాగా, సరళంగా, సుబోధకంగా రూపొందించాం అన్నారు అనంతరం డి రామానాయుడు మా చిత్రంలో పరుచూరి వెంకటేశ్వరరావు తొలి సారిగా నటించడం విశేషం అల్లు రామలింగయ్య అస్వస్థత మూలంగా వారి కనుకున్న నాటకాల రాయుడి పాత్రను మహాద్భుతంగా నటించారు గోపాల కృష్ణ కూడా ప్రశంసనీయంగా నటించారు చంద్రమోహన్ రాజేష్ రాజా, రాళ్ళపల్లి ఈశ్వరరావు వేలు జ్యోతి అహల్య సంగీత, సూర్యకాంతం కాకినాడ శ్యామల, నిర్మల ఉన్నత వర్గానికి నూతన్ ప్రసాద్ మధ్య తరగతికి గొల్లపూడి బడుగు వర్గానికి పి ఎల్ నారాయణ ప్రతినిధులుగా పెళ్ళిళ్ల పేరయ్యగా సాక్షి రంగారావు, నూతన్ ప్రసాద్ కుమార్తెగా తులసి నటిం-చారు అని వివరించారు చక్రవర్తి స్వర కల్పనలో వేటూరి, సి నారాయణ రెడ్డి గీతాలు రాశారు సుందరం ఛాయ, మార్తాండ్ కూర్పు నిర్వహించారు

"మాంగల్య బలం రెండవ షెడ్యూల్ అక్టోబర్ 10 నుంచి 20 వరకు జరిగినట్లు చివరి షెడ్యూల్ నవంబర్ 10 నుంచి 30 వరకు జరుగుతుందనీ నిర్మాత తెలియజేశారు ఇందులో శోభన్ బాబు జయసుధ గుమ్మడి, గిరిబాబు రాధిక, గొల్లపూడి నూతన్ ప్రసాద్, ప్రభాకరరెడ్డి జ్యోతి, రాగిణి రమాప్రభ, అంజలీదేవి వగైరా తారాగణం గుహ-నాథన్ కథ, సత్యానంద్ మాటలు వేటూరి గీతాలు, జి ఎ సుబ్బారావు శిల్పం, మార్తాండ్ కూర్పుతో బోయిన సుబ్బారావు స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహించారు

### కొన్ని చిత్రాల పేర్లు

సుమన్ హీరో గా కె వాసు దర్శకత్వంలో డాక్టర్ వేమూరి రమేష్ బాబు నిర్మించే చికాగో ఫిలిమ్స్ చిత్రం పేరు అమెరికా అల్లుడు

నరేష్, పూర్ణిమ జంటతో కె బాబూరావు దర్శ-కత్వంలో కె రమాదేవి ఎం శ్యామల నిర్మించే రామ విజేతా మురళీ కృష్ణా కంబైన్స్ చిత్రం వియ్యంకుల సవాల్

నందమూరి బాలకృష్ణతో ఎన్ బి చక్రవర్తి దర్శకత్వంలో జి రామచంద్రరావు, ఎస్ అప్పారావు నిర్మించే గరుడా ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రం పేరు ప్రళయ జ్వాల



## "అపనిందలు ఆడవాళ్లకేనా?"లో అడ్డుగోడలు

రంగారావు ఫోటో పెరట్లో అరుణ, మురళి ఉన్నారు అరుణ ఖిన్న వదనంతో తమ్ముడూ అన్నం మాడిందిరా, అంది

మాడితే మాడిందిలేవే మాడింది మనం తిందాం మంచిది నాన్నకు పెడదాం ఆ మాడింది కేరియర్‌లో పెట్టి రెడీ అవ్," అంటూండగా పక్క వాటాలోంచి జానకి (శారద) వచ్చి, మురళీ, ఆవకాయ ఈ భాగంలో ఉండిపోయింది ఇందా అంటూ జాడీ ఇవ్వబోయింది



అనితారెడ్డి, "శ్రీవారికి శోభనం"

హరనాధ్ (రంగనాధ్) ఆదరాబాదరాగా వచ్చి, జానకీ! వాళ్లకూ, మనకూ సంబంధాలు తెగిపోయాయి ఆవకాయ కాదు కదా- ఆవ గింజ కూడా వాళ్లకివ్వడానికి వీల్లేదు మళ్లీ ఎప్పుడైనా వాళ్లతో మాట్లాడ్డంగాని, ఇవ్వడంగాని చూశానో- ఊరుకోను జాగ్రత్త! అన్నాడు

కుటుంబరావు (గొల్లపూడి మారుతీరావు) ఊడిపడుతూ, మా కళ్లు కప్పడానికిదో నాటకమన్న మాట! వాళ్లంటే నీకెంత ప్రేముందో- వాళ్ల మీద నీకెంత మమకారముందో ఈ గోడే చెప్తోంది పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యకు! అన్నాడు

జానకి స్థాణువులా నిలుచుండిపోయింది

డాక్టర్ నెల్లుట్ల మాటలు, పాటలు సమకూర్చిన సురేఖా ఎంటర్‌ప్రైసెస్ అపనిందలు ఆడవాళ్లకేనా? చిత్రాన్ని వేజెళ్ల సత్యనారాయణ కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో కె ప్రకాష్‌రెడ్డి నిర్మించారు



డాక్టర్ భానుమతీ రామకృష్ణ 60వ ఏట ప్రవేశించిన తరుణంలో తెలుగు ఫిలిమ్స్ జర్నలిస్టుల అసోసియేషన్ వారు మదరాసులో ఘనంగా సత్కరించిన సందర్భంలో శుభాకాంక్షలందచేస్తున్న షావుకారు జానకి

## కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో "చండ ప్రచండ"

రోసిరాజు దర్శకత్వంలో"మిస్టర్ ఎక్స్" చిత్రాన్ని నిర్మిస్తున్న సి కె భానోజీరావు, జె అనంతకృష్ణ అమ్మ ఫైనార్ట్స్ సమర్పణలో అశ్వనీ కంబైన్స్‌వారి తదుపరి చిత్రం "చండప్రచండ"కు సన్నాహాలు చేస్తున్నారు శివకృష్ణ హీరోగా మార్చి 20 నుంచి ఏప్రిల్ 20 వరకు ఒకేషెడ్యూల్‌లో చిత్రీకరణ ముగిసే ఈ కౌబాయ్ చిత్రానికి కె ఎస్ ఆర్ దాస్ దర్శకుడు

## బాలకృష్ణ "తిరగబడ్డ తెలుగు పులి బిడ్డ"

రాజకీయ అలజడులు ప్రధానాంశం నేటి అస్తవ్యస్థ రాజకీయ పరిణామాలకు అద్దం పట్టే ఇతివృత్తం అన్నారు ఎడిటర్ కె సత్యం ఉయన ఈ చరిత్ర ఇంకెన్నాళ్ళు అనంతరం సమర్పించే గుప్తా క్రియేషన్స్ ద్వితీయ చిత్రం తిరగబడ్డ తెలుగు పులి బిడ్డలో బాలకృష్ణ హీరో కె వి నారాయణ గుప్త నిర్మాత

"సంగీత సామ్రాట్"లో అక్కినేని, జయప్రద



## జనార్ధన్ దర్శకత్వంలో శ్వేత చిత్ర ఇంటర్నేషనల్

"సెంటిమెంట్‌తో పాటు కామెడీ." అన్నారు వల్లభనేని జనార్ధన్ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శివశంకర్ నిర్మించే శ్వేతచిత్ర ఇంటర్నేషనల్ వారి ద్వితీయ చిత్రం రెండవ షెడ్యూల్ అక్టోబర్ 21 నుంచి 31 వరకు జరిగింది చంద్రమోహన్, సుధాకర్, సుమలత, అరుణ, నిర్మల, అనూరాధ, జయమాలిని, మాలి వగైరా తారాగణం ముఖ్యప్రాత్ కథకు గోపి సంభాషణలకర్త కృష్ణ-చక్ర స్వరకల్పనలో గోపి, సత్యమూర్తి వి ఎస్ మల్లికార్జున్ సహ నిర్మాత వల్లభనేని శ్వేతలానా సమర్పణలో ఈ చిత్రాన్ని నిర్మించే శివశంకర్ "నవంబర్ 15 నుంచి 30 వరకు చివరిషెడ్యూల్ జరుగుతుంది." అన్నారు

## "ఈ పోరాటం మార్పు కోసం"

అక్టోబర్ 1 నుండి 30 వరకు రేపల్లె, నగరం, నిజాంపట్నం ఫిషింగ్ హార్బర్ ప్రాంతాల్లో షూటింగ్ జరిపాం, అన్నారు లక్కా రాధాకృష్ణ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి ఎల్ కాంతారావు కథ సమకూర్చి నిర్మించే శ్రీదేవి సినీ క్రియేషన్స్ వారి పై చిత్రంలో ప్రబ నవ నటి జయలలిత, సాయిరాం, విక్రమ్‌షా, శ్యాం నమ్మాళ్వార్, భిక్షాల్రావ్, తారక రాజేంద్ర, నరసింహారావు, ఎన్ సుబ్బారావు, శేషా చలపతి, సి ఎస్ ఆర్ కె ప్రసాద్ గురునాథరావు, నేరెళ్ల దేవి, బిందు మాధవి, రామకుమారి, కల్పన, భువనేశ్వరి, వాణి, మాధవి శైలజ, భవాని పాత్రదారులు సత్యవతీ సత్యం మాటలు, ఉపేంద్ర కుమార్ సంగీతం, విజయ్ ఛాయ, హనుమంతరావు శిల్పం, పి సి మోహన్ కూర్పు, జి వి రావు-బి జి వి రావు ప్రొడక్షన్స్‌తో లయన్ టి వి పాండు రంగారావు సమర్పిస్తారీ చిత్రాన్ని

# నలుపు తెలుపు రంగులు

**మునుపటి కాలంలో నలుపూ తెలుపూ సినిమాలో రంగులు కావాలంటే ఒక్కొక్క ఫ్రేము బొమ్మకి రంగులు వేసేవారు? ఒక సెకెండుకి 24 ఫ్రేములంటే ఒక సినిమాకి ఎన్ని ఉంటాయో ఆలోచించండి**

ఇప్పుడు కంప్యూటర్‌ల సహాయంతో రంగులు వేసే పద్ధతిని మార్చేస్తున్నారు కెనడాకి చెందిన "కలరయిసేషన్" సంస్థా, లాస్ఏంజిలిస్‌కి చెందిన "కలర్ సిస్టమ్‌స టెక్నాలజీ సంస్థా స్వంతంగా ఎవరి పద్ధతిని వారు తయారుచేసుకున్నారు రెండింటికీ ఆధారం ఒకటే

అదేమిటంటే, కంప్యూటర్‌ల ద్వారా ప్రతి ఫ్రేమ్‌లోని బొమ్మకి 525000 చుక్కలుగా విభజిస్తారు ఒక్కొక్క చుక్కకీ "కాంతి విలువ ఉంటుంది (చంద్రమండలం నుంచి పంపే బొమ్మలని కూడా చుక్కలు వేసి పంపుతారు ) ఈ కాంతి విలువలో "రంగు విలువ" కూడా ఇమిడి ఉంటుంది

పరిశోధనల ద్వారా తెలిసినదేమిటంటే ఫ్రేముకీ ఫ్రేముకీ మధ్యచుక్కలలో వ్యత్యాసాలు 4 శాతంకన్నా ఉండవని అందుకే ఎలెక్ట్రానిక్ పరికరాల సహాయంతో ఒక ఫ్రేములోని బొమ్మయొక్క భాగాలకి రంగులు కేటాయిస్తే తక్కిన ఫ్రేములలోని బొమ్మలన్నిటికీ రంగులు కేటాయించినట్లే! కంప్యూటర్‌లు చుక్కల సహాయంతో ఈ విభజన, కేటాయింపులు చేస్తాయి

సినిమా అంతా ఒకే రకం బొమ్మలు ఉండవు కదా? సీనులు మారుతాయి కదా? వీటికి తగినట్లు మార్పులు చేసుకోవచ్చు!

ఒక హాలీవుడ్ సినిమాకి సగటున 30 రంగుల కేటాయింపు పనులు జరగవచ్చు

ఒక్కొక్క సినిమాని రంగులలోకి మార్చాలంటే 180000 డాలరులు అవుతుందిట అంటే, రూపాయలలో రు 20 లక్షల కన్నా ఎక్కువే



**సహజం ఉట్టిపడేలా కీ శే చక్రపాణి రచించిన విజయా వారి "షావుకారు" చిత్రానికి ఆయనతో పాటు, గీతాలు, సంగీతం సమకూర్చిన కీ శే సముద్రాలు, కీ శే ఘంటసాలగార్లను కృతజ్ఞతాంజలిగా "విజయచిత్ర" వెలువరించిన 'షావుకారు' ఎల్ పి రికార్డును విజయాధినేత శ్రీ బి నాగిరెడ్డికి అందజేస్తున్న గ్రామఫోన్ కంపెనీ అధినేత శ్రీ మంగపతి.**

## "సజీవ మూర్తులు"

ప్రవీణ్ చక్రవర్తి అనే కొత్త హీరోను పరిచయం చేస్తున్నాం అక్టోబర్ 3వ వారం నుంచి వైజాగ్‌లో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు డి మోహన్‌జీ ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహిస్తూ నిర్మించే శ్రీ కనక మహాలక్ష్మి మూవీస్ "సజీవమూర్తులు" చిత్రంలో పూర్ణిమ, గుమ్మడి, నాగభూషణం, కాకరాల, కె వరలక్ష్మి, ఎన్ దర్గాజీ, వరహాలరాజు అశోక్ కుమార్, కె ఎ, రమణ వగైరా నటవర్గం దాసం గోపాలకృష్ణ మాటలు, పార్ధ సారధి సంగీతం, వి కె లింగం ఛాయ, ఎస్ ఆర్ ఖాజా కూర్పు, పల్లారాము ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు

## మోహన్‌బాబుతో "విఘ్న చక్రం"

నవంబర్ డిసెంబర్‌లలో 13-30 తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు జి ఆర్ కె రాజు ఈయన సమర్పించే శ్రీ లక్ష్మీదేవి పిక్చర్స్ విఘ్న చక్రం" షూటింగ్ అక్టోబర్ 11, 12 న జరిగాయి మోహన్‌బాబు భానుప్రియ, శరత్‌బాబు, ప్రభ, సత్యనారాయణ, వంకాయల, సుధాకర్, రాజ్యలక్ష్మి, టెలిఫోన్ సత్యనారాయణ నటిస్తున్నారు కథ, మాటలు పరుచూరి సోదరులు రాశారు చక్రవర్తి సంగీతం, కె ఎస్ హరి, ఛాయ, నాగరాజ్ శిల్పం, వెంకటరత్నం కూర్పు, రామ్ సూరి సహకార దర్శకత్వం, కపిల నాగేశ్వరరావు-విజయ కృష్ణ ప్రొడక్షన్‌తో భాస్కరరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఈ చిత్రానికి జి రాజేశ్వరి నిర్మాత □

యస్.వి.రెడ్డి సమర్పించు

శ్యామలా ఫిలింస్

# సంగీత సామ్రాట్

గంగాధర్



సంగీతం
రమేష్ నాయుడు
కెమెరా
సెల్వరాజ్

నిర్మాత
శ్రీమతి డా॥ కె. శ్యామలమ్మ

నిర్వహణ.
ఎస్.కృష్ణమూర్తిరాజు

స్క్రీన్ ప్లే-దర్శకత్వం సింగీతం శ్రీనివాసరావు

అన్నపూర్ణ

# ఎదవీణ మ్రోగినవేళ

సీరియల్

"కృష్ణజ"

"సత్యా

ఉలిక్కిపడి తల ఎత్తి చూసింది సాకేత

ఎదురుగా శ్రీధర్

సాకేత ఒక్క క్షణం అయోమయంలో పడిపోయింది

తను కల గంటుందా ? ఊహిస్తుందా ?

తను ఆలోచిస్తున్న వ్యక్తి తను ఊహిస్తున్న వ్యక్తి

సత్యా

ఊఁ

ఒక్కదానివీ కూర్చుని ఏం చేస్తున్నావ్ ?

మౌనంగా ఉండిపోయింది సాకేత

చుట్టూ సంధ్య చీకట్లు ముసురుకుంటున్నాయి

ఊరు దూరంగా చీకటిలో లీనమవుతూ తన అస్థిత్వాన్ని కోల్పోతోంది ఎత్తైన కొండ ఆ కొండమీద ఉన్న గుడి కావడంచేత ఎప్పుడో పర్వ దినాల్లో తప్ప ఎక్కువ రద్దీగా ఉండదు

కొండమీద చెదురు మదురుగా ఉన్న భక్తులు కొండ దిగి వెళ్ళే ప్రయత్నంలో ఉన్నారు

కొండమీద కోనేరు

కోనేటి గట్టున శిల్పంలా కూర్చుని తదేకంగా నీటి వంక చూస్తోంది సాకేత

ఆ కోనేటి కెంతో చరిత్ర ఉంది

కొండమీద వెలసిన ఆ కోనేరు తాటి ప్రమాణం లోతు ఉంటుందని చెప్పుకుంటుంటా రందరూ

పరీక్ష తప్పిన కుర్రాళ్ళకూ ప్రేమలో మోసపోయిన అమ్మాయిలకూ, పెళ్ళికి పెద్దవాళ్ళు అడ్డు పెట్టిన జంటలకూ, ఎంతో మందికి శాశ్వతంగా ఆశ్రయ మిస్తుంటుందా కోనేరు

సత్యా

ఊఁ

మాట్లాడవా ?

ఏం మాట్లాడను ?

నీకు సంబంధం కుదిరించటగా

**జరిగిన కథ-3 : సాకేతను చూచేందుకు పెళ్ళిచూపులకై మాధవరావు అతని తల్లి జానకమ్మ వస్తారు. వాళ్ళకు సాకేత నచ్చుతుంది. రాజారావు దంపతుల ఆనందానికి అవధులు లేవు.**

నీకు నీకు ఇష్టమేనా ?

చురుక్కున చూసింది సాకేత

అది ఎగతాళా ? తమ మధ్య ఏమీ లేనట్లు ఎంత చక్కగా మాట్లాడుతున్నాడు

అతనితో మాట్లాడేందుకు ఇష్టం లేక లేచి నుంచుంది సాకేత

కూర్చో సత్యా

తిరిగి కూర్చుంది సాకేత

"సత్యా! నువ్వంటే నాకు చాలా ఇష్టం కానీ

ఈ విషయం మొన్ననే చెప్పావు శ్రీధర్

"సత్యా! అంత పరాయి వాడిని అయిపోయానా? శ్రీధర్ అని పిలుస్తున్నావు

నువ్వు పరాయి వాడివి కాక నాకేమవుతావు శ్రీధర్

ఆమె ఒక్కో మాటా వాడి బాణంలా గుండెను చీలుస్తుంటే విలవిలలాడి పోయాడు శ్రీధర్

అంతేనా సత్యా ? దిగులుగా అన్నాడు

సాకేత మౌనంగా ఉండిపోయింది

"సత్యా! నామీద కోపంగా ఉంది కదూ ?

"లేదు కానీ, నా మీద నాకే కోపంగా ఉంది

"ఎందుకు ? అమాయకంగా అడిగాడు శ్రీధర్

"ఈ కోనేటిలో పడి ప్రాణం తీసుకోకుండా ఇంకా నీతో మాట్లాడుతున్నందుకు

"సత్యా

"అవును సత్యనే మాట్లాడుతున్నాను

"సత్యా! నేనంటే అంత అసహ్యంగా ఉందా ?

శ్రీధర్, ఇంకెప్పుడూ నాకు కనిపించకు నాతో మాట్లాడాలని ప్రయత్నించకు నాలో మానని గాయాన్ని క్రూరంగా మళ్ళీ, మళ్ళీ రేపకు ప్లీజ్ వెళ్ళిపో

ఉన్మాదం ఆవరించిన దానిలా ఉద్రేకంతో ఊగిపోతూ ఆవేశంగా అరచింది సాకేత

దుఃఖం, కసి కోపం, నిస్సహాయ వేదనతో ఉన్మాదిలా మారింది సాకేత

"సత్యా! నేనేం చెయ్యను ?

సాకేత అసహ్యంగా చూసింది శ్రీధర్ వంక

తనకంటే రెండు గుప్పెళ్ళ పొడవూ బలమైన శరీరంతో ఉన్న శ్రీధర్‌కు ఇంత పిరికి గుండె పెట్టాడేం భగవంతుడు

ఛీ ఛీ . ఇంత పిరికి వాడినా తను పసితనం నుండీ ప్రేమించింది ఆరాధించింది

"నువ్వంటే నా కిష్టం" అంటూనే ఏం చెయ్యను ?" అనే పిరికి వాడికా తను మనస్సు ఇచ్చింది

"సత్యా' చీకటి పడుతుంది ఇంక వెడదాం రా "

"నువెళ్ళు శ్రీధర్ నేను తరువాత వస్తాను "

ఊహుఁ నువ్వూ పద

శ్రీధర్ భయం అర్ధమైంది సాకేతకు

పౌరుషం వచ్చింది

నిజానికి ఈ గుడినీ, ఈ కోనేటినీ వెదుక్కుంటూ తను అందుకే వచ్చింది అందుకే చీకటి కొరకు వేచి చూసింది కానీ శ్రీధర్ అభిప్రాయం తెలిసిన తరువాత తన పిరికితనానికి సిగ్గు వేసింది పౌరుషం కలిగింది

ఒక్కడుగు తన కోసం ముందుకు వెయ్యలేని ఈ పిరికి మనిషి కోసం తనెందుకు జీవితం బలి చేసుకోవాలి ?

తనను పొందలేని బాధ అతనికి లేనప్పుడు అతను లేకపోతే తను మాత్రం ఎందుకు బాధ పడాలి ?

క్షణంలో తన అభిప్రాయాన్ని మార్చుకుంది సాకేత

"శ్రీధర్ నువ్వు పెళ్ళి చేసుకోనంత మాత్రం చేత ఆత్మహత్య చేసుకునేంత పిరికిదాన్ని కాదు పద వెడదాం " కఠినంగా అంది సాకేత

శ్రీధర్ సాకేత కళ్ళల్లోకి చూడనట్లుగా తల వంచుకున్నాడు

లేచి నిలబడి కొండ మీది నుండి క్రిందికి చూసింది సాకేత

విద్యుద్దీప కాంతులతో ఊరు వెలుగులు వండించుకుంటోంది

శ్రీధర్‌ను పట్టించుకోకుండా నెమ్మదిగా మెట్లు దిగడం ప్రారంభించింది సాకేత

* * * * *

గది మల్లెపూల పరిమళంతోనూ, మంచి గంధం సువాసనలతోనూ, సాంబ్రాణి వత్తుల ఘుమ ఘుమలతోనూ గుబాళిస్తోంది

పాల కడలిలా మల్లెలు పరచిన మెత్తటి, తెల్లటి పడక- కిటికీలో నుండి జాలు వారుతోన్న వెన్నెల జిలుగులు వెలుగులూ శోభన రాత్రికి ఉద్దీపన కలిగిస్తున్నాయి

శోభన వధువుగా గదిలోకి అడుగు పెట్టిన సాకేత గుండెల్లో నును సిగ్గు దొంతరలకు బదులుగా వేల వేల ఆలోచనా తరంగాలు భయం ఆరాటం ఆవేదన నిస్సహాయత ఆలోచన సంచలనం ఇష్టం లేని పెళ్ళికి తలవంచిన ప్రతి ఆడపిల్ల హృదయంలోనూ తొలి రేయి కలిగే భావావేశం

గది అలంకరణతో పాటూ, జరీ పట్టు చీర, పూల జడా, కల్యాణ తిలకం పారాణి దిద్దిన పాదాలూ, తన మనోభావాలను వెక్కిరించినట్లుగా అనిపించింది సాకేతకు

ఈ సమయం వస్తుందని తెలుసు వచ్చినప్పుడు తనేం చేయాలో చాలా రోజులుగా ఆలోచించుకుంది సాకేత

చిన్న తనం నుండీ మానసికంగా భర్తగా ఊహించుకున్న శ్రీధర్ స్పర్శ తప్ప మరో పురుషుని స్పర్శ భరించలేవు తన మన శ్శరీరాలు అందుకే. గదిలోకి వెడుతూనే తను స్పష్టంగా చెప్పేస్తుంది –నువ్వంటే నాకు ఇష్టం లేదు నన్ను తాకవద్దు అని అంతే

పురుషాహంకారంతో అతను తనను అవమానించ చూస్తే ఎదురు తిరుగుతుందే తప్ప ఒక్క నాటికీ అతనికి లొంగదు ఇక ఈ జీవితం అలా వెళ్ళమారిపోవాల్సిందే

గది గుమ్మం వద్ద నించున్న సాకేతకు కాళ్ళు లాగుతున్నట్లనిపించి ఓరగా మంచం వైపు చూసింది

మాధవ్ మంచం మీద పడుకుని సిగరెట్ తాగుతున్నాడు సిగరెట్



తెలుగుసానెట్లు-1

# సంగమం

పర్వత సానువుల నిశ్శబ్దాన్ని
సరోవరంలో కలవరించే అలలు
కోటి కలువలతో కలలు కంటాయి...

మృత్తికాచ్ఛాదనంలో హాయిగా నిద్రిస్తూ
తొలకరి పులకల ధ్యానించే విత్తు ప్రశాంతిని
చంచరీకాల రెక్కల తుఫానులో
వ్రక్కదలే సుమహృదయం స్వప్నిస్తుంది

అంగరఖాలో దాగి మూల కొదిగిన మృదంగం
కళాంగుళుల మృదు స్పర్శ కోసం నిరీక్షిస్తుంది.

అందుకే ఈ ఏకాంత స్వాప్నిక శాంతి నాకొద్దు-
జనవాహినిలో కలసి పారే తుషార బిందువైనా చాలు.

జీవ చైతన్యంతో వసంత సహస్రాన్నై
కుసుమిస్తాను. సురభిళ తరంగాన్నై
పవనంతో సంగమిస్తాను, విరుస్తాను హాసాన్నై

–సోమసుందర్

## ఎదవీణ మ్రోగిన వేళ

త్రాగి తాపీగా వస్తాడేమో తన దగ్గరకు తన ప్రాణం పోయినా సరే అతనికి లొంగదు

సాంఘికంగా తను అతని భార్య కానీ మానసికంగా తను ఒక్కనాటికీ అతని భార్య కాలేదు సంఘంలో అతని భార్యగా మసలుకుంటుంది స్నేహంగా అతని అవసరాలు చూస్తుంది అంతే తప్ప శారీరకంగా అతన్ని సుఖపెట్టలేదు

సాకేత తన భావనా ప్రపంచంలో కొట్టుకు పోతోంది అతను తనను తాకితే తనను తను ఎలా రక్షించుకోవాలో ఊహిస్తూ ఊహల్లో వేగిపోతోంది

మధ్య మధ్య ఉలిక్కిపడుతోంది భయంతో నించుని నించుని కాళ్ళు నెప్పి పుట్టి ఆలోచనల నుండి తేరుకున్న సాకేత తల ఎత్తి మంచం వైపు చూసింది

అంతే ఆశ్చర్యంతో తల మునకలయ్యింది

మాధవ్ నిశ్చింతగా నిద్ర పోతున్నాడు

నమ్మలేని నిజం కానీ నిజం

ఆ పరిస్థితి ఆమెకు ఆశ్చర్యంతో పాటు ఆనందాన్ని కలుగ జేసింది

తాను భయపడినట్టుగా ఏమీ జరగనందుకు

రోగి కోరిందీ పాలే వైద్యుడు చెప్పిందీ పాలే అన్నట్టుగా తను కోరుకుందే సంభవించినందుకు, తన కన్యాత్వం రక్షింప బడినందుకూ సాకేత హద్దులు లేని ఆనందం పొందింది

ఆ ఆనందంలో ఆమె ఒక్క క్షణం కూడా ఇలా ఎందుకు జరిగింది ? అనే విషయం ఆలోచించలేదు

అసలా విషయం ఆమె ఆలోచనా పరిధిలో కేరాలేదు

అప్పటి వరకూ ఆ గదిలో ఏదో జరుగుతుందని తొంగి చూసిన చంద్రుడు ఆ గదిలో ఏదీ జరిగే సూచనలు లేకపోవడంతో నిరాశతో దూరంగా తప్పుకున్నాడు

దిండూ – దుప్పటీ తీసుకుని సాకేత నేలమీద పడక ఏర్పాటు చేసుకుంది

కానీ ఏ రాత్రయినా అతను తన మీద దాడి చేస్తాడేమో అనే భయంతో తెల్లవార్లూ కలత నిద్రలో నే గడిపింది

తెల్లవారింది

తనూహించింది ఏదీ జరగక పోవడంతో తృప్తిగా, సంతోషంగా బయటికి నడిచింది

చిత్రమైనది స్త్రీ హృదయం

* * * * *

ఆషాఢం వెళ్ళిపోయింది

కోడలిని కాపురానికి తీసుకు వచ్చింది జానకమ్మ

భార్యను తీసుకెళ్ళడానికి అల్లుడు వస్తాడని ఎదురు చూసిన రాధమ్మకూ – రాజారావు గారికీ నిరాశ కలిగింది

అల్లుడూ – కూతురూ చిలకా – గోరువంకల్లా కిల కిల లాడుతూ ఓ రెండు రోజులు తమ కళ్ళ ముందు ఉంటారనే వారి కోరిక తీరకుండానే వియ్యపురాలితో పాటు కూతురిని అత్తవారింటికి పంపించారు

పల్లె పట్టణంగాని ఊరు

అత్తవారిల్లు రెండు గదులూ, వంటిల్లూ, వసారాతో కుదురుగా చక్కగా అనిపించింది సాకేతకు

ఇంటి వెనుక బావి బావి చుట్టూ చప్టా పాదులు వేసుకునేందుకు ఇంటి ముందూ ఇంటి వెనకా కూడా ఖాళీ చోటు ఇంటి ముందు గేటుకు ఆనుకుని మల్లె పందిరి

ఆ ఇల్లూ – ఆ పరిసరాలూ చాలా నచ్చాయి సాకేతకు

ఎంచక్కా పెరటి నిండగా మొక్కలు పెంచుకోవచ్చు ఇంటి ముందు ఖాళీ చోటులో పూల మొక్కలు నాటుకోవచ్చు పూల మొక్కలు విరగబూస్తే ఇల్లు ఎంత కళ కళలాడుతుందీ ?

ఆలోచనా మాత్రంతో నే ఆనందం పొందింది

సాకేతకు మొక్కలు అంటే ప్రాణం

కొంత క్రొత్త తీరి భయం తగ్గాక తోట పనిలోకి ప్రవేశించి ఉన్న మొక్కలకు పాదులు తవ్వింది

ఎండిపోయిన మొక్కలు తీసి క్రొత్తవి నాటింది

ఇంటి ముందు స్థలం పూల మొక్కలకూ పెరటి స్థలం పాదులకూ, కూర మొక్కలకూ కేటాయించి, బీర, సొర, కాకర, పొట్ల గింజలు నాటింది

జానకమ్మ పైపైన అజమాయిషీ చేస్తూ కోడలికి సలహాలిచ్చింది ఇంట్లో ఉండేది మొత్తం నలుగురు మాత్రమే

అత్తా – కోడలూ, తండ్రీ – కొడుకూ ఆడపిల్ల స్వాతికి, సాకేతతో పాటే పెళ్ళి అయింది

స్వాతి అత్తవారిల్లు విజయవాడ ఆమె భర్తకు బ్యాంక్‌లో జాబ్ స్వాతి ఎప్పుడో చుట్టపు చూపుగా మాత్రం వస్తూంటుంది

ఉదయం కాఫీలు అయ్యాక వంట వంటవుతూనే తొమ్మిది గంటలకల్లా మగవాళ్ళిద్దరూ భోంచేసి షాపుకు వెళ్ళిపోతే తిరిగి మళ్ళా వచ్చేది రాత్రి తొమ్మిది తరువాతే

ఈలోపు మధ్యాహ్నం టిఫిన్ గానీ, భోజనం కానీ షాపుకు పంపాల్సిందే

మగవాళ్ళు వెళ్ళిపోయాక మిగిలిన పనులు పూర్తి చేసుకుని బట్టలూ, స్నానం, భోజనం పూర్తి చేయడం మళ్ళా మధ్యాహ్నానికి టిఫిన్ కాఫీ రాత్రికి వంట

అత్తగారి అజమాయిషీలో కడిగిందే కడగడం తోమిందే తోమడం చేసిందే చేయడం

ఏమిటీ ? అంటే శుభ్రం దాని పేరు

కోడలు నిముషం ఖాళీగా కనిపిస్తే తోచదు జానకమ్మకు వెంటనే ఆమెకు ఏదో పని కనిపిస్తూనే ఉంటుంది

ఆ ఇంట్లో మగవాళ్ళిద్దరికీ వీలయినంత వరకూ తమ పనులు తాము చేసుకోవడం అలవాటు

వాళ్ళు దేనికీ ఎవరినీ ఇబ్బంది పెట్టరు సమయానికి ఏదో ఇంత తిని వెళ్ళడం తప్ప మరో విషయం పట్టదు వాళ్ళకు

కానీ జానకమ్మ మాత్రం అత్తగారి హోదాలో ఉదయం మొహం కడుక్కునేందుకు నీళ్ళు అందివ్వడం దగ్గర్నుంచి రాత్రి పడుకోబోయే ముందు మంచి నీళ్ళు అందివ్వడం వరకూ అన్ని పనులూ అధికారికంగా చేయించుకుంటుంది

ఏదైనా ఆవగింజంత లోపం జరిగితే గయ్యాళి అత్తగారిలా పోట్లాడదు కానీ, ముఖం మాడ్చుకుని రోజుల తరబడీ మాట్లాడకుండా ఉండి పోతుంది

అప్పుడు ఆమె ముఖం చూడాలంటేనే సాకేతకు భయం సమయమంతా పనికే సరిపోతుంది సాకేతకు

మధ్యలో ఏ కాస్త సమయం దొరికినా ఓ పుస్తకం తిరగేసేందుకు గానీ రేడియో వినేందుకు గానీ, తనకు నచ్చిన ఓ కుట్లు పని చేసుకునేందుకు గానీ లేకుండా అత్తగారు పనులు పురమాయిస్తుంటుంది

ఉదయం హడావిడిగా తన పనులు చూసుకుని పదింటికల్లా భోంచేసి షాపుకు వెళ్ళిన భర్త తిరిగి రాత్రి పది గంటలకు గానీ షాపు నుండి ఇంటికి రాడు స్నానం భోజనం నిద్ర

సాకేతకు ఈ జీవితం గురించి తీరుబడిగా ఆలోచించుకునేందుకు కూడా సమయం లేనట్లు యంత్రంలా ఇంట్లో తిరుగుతూ ఉంటుంది

ఆ యంత్రం అలసిపోకూడదు

అలసిపోతే అవిధేయత

ఆగిపోకూడదు –

ఆగిపోతే సాధింపు

సాకేత అత్తగారి గురించి వేసుకున్న అంచనాలు తల్లక్రిందులయ్యాయి పెళ్ళి చూపులలో చూపించినంత ఆప్యాయత లేదు ఆమెలో

అంత కలుపుగోలు మనిషీ కాదు

ఇంటి పెత్తనమంతా జానకమ్మదే

అలాగని జానకమ్మ దుర్మార్గురాలు కాదు

కోడలికి అన్నం పెట్టకుండా ఉండే గయ్యాళి అత్తగారూ కాదు

తను పని చేయకుండా కూర్చుంటుంది కానీ ఎదుటి వాళ్ళు క్షణం విశ్రాంతి తీసుకున్నా ఆమె సహించలేదు

సోమరిపోతు , నిద్రపోతు పని దొంగ ఇలాంటి బిరుదులు ప్రసాదిస్తుంటుంది

నగలూ, చీరలూ, పువ్వులూ, సినిమాలూ ఇలాంటి సరదాలు ఆవిడకు కావాలి

కానీ ఎదుటి వారి సరదాలూ, కోరికలూ ఆవిడకు వ్యసనాల్లా కనిపిస్తాయి

పూల పిచ్చి సినిమాల షోకు నగల పిచ్చి పుస్తకాల రంధి జానకమ్మ విమర్శించే పదజాలం ఇది

అత్తగారిని అర్థం చేసుకున్న సాకేత మరిచిపోయి కూడా నడుం వాల్చదు పుస్తకం పట్టుకు కూర్చోదు

అసలా ఇంట్లో అలా కూర్చునేందుకు కుదరదు కూడా

ఎంత పని మనిషి చాకలి లేకపోయినా నలుగురే మనుష్యులుండే ఇంట్లో అంత పని ఉంటుందా ? అని ఆశ్చర్యపోయేందుకు వీల్లేదు

జానకమ్మగారికి పని ఏవీ కనిపించకపోతే అటకమీద ఇత్తడి సామానూ, బీరువాల్లోని స్టీలు సామానూ తోమి పెట్టే పనైనా కనిపిస్తుంది చివరికి జానకమ్మ పని దయ్యం

అంటే ఆమె పని చెయ్యదు కానీ ఆమె కంటికి పని ఎప్పుడూ కనిపిస్తూనే ఉంటుంది

ప్రతిసారిలాగే పిరియడ్స్‌లో వచ్చే పెయిన్స్‌తో బాధ పడుతోంది సాకేత నడుం నొప్పితో గచ్చు నేలమీద వెల్లకిలా పడుకుంది బాధతో

చాటలో బియ్యం పోసుకుని వరండాలో కూర్చుంది జానకమ్మ ఆ వేళకు మూడు రోజులుగా ఆవిడ ముఖం ఎందుకో చిటపట లాడుతోనే ఉంది

కాలక్షేప మిత్ర బృందం తీరిక సమయాల్లో చేస్తున్న పనితో సహా హాజరయ్యారు

ప్రక్కింటి విమలమ్మా వనజా మేస్టారి భార్య కాంతమ్మా

ఏం జానికమ్మా వదినా' బియ్యం నువ్వు ఏరుతున్నావ్ ? కోడలు లేదా ఏం ? విమలమ్మ కూర్చుంటూ పలకరింపుగా అంది

ఆవీధిలోని అత లంతా జానకమ్మ అదృష్టానికి అసూయ పడతూ ఆవిడకేం మహారాణి ఇటు పుల్ల తీసి అటు పెట్టక్కర్లేదు పనంతా కోడలే చేస్తుంది అనుకుంటుంటారు

కోడళ్ళు వస్తే మాత్రం, మన పని మనకు తప్పుతుందా ఏవిఁటీ ?

అదేంటమ్మోయ్ వదినా క్రొత్తగా మాట్లాడుతున్నావు పనంతా కోడలే చేస్తుందిగా ?

ఆఁ చేస్తుంది ఎందుకు చెయ్యదూ ? ఆ గదిలో పడుకుని చేస్తూనే ఉంది చూడరాదూ అంది ఈసడింపుగా

మీటింగులోని మాటలు లోపలికి స్పష్టంగా వినిపిస్తున్నాయి

సాకేత కళ్ళలో నీళ్ళుబికాయి

లేచిన దగ్గర్నుండీ క్షణం కూర్చోకుండా, తిరిగి పడుకునే వరకూ తను పని చేస్తూనే ఉంటుంది ఇంకెలా చేస్తే అత్తయ్యకు తృప్తి ? అనుకుంది బాధగా

'అదేవిఁటి అత్తయ్యగారూ మీ కోడలు ఎప్పుడు చూసినా పని చేస్తున్నట్లే కనిపిస్తుందిగా ? అడిగింది వనజ

తెలివి ఉండాలే తల్లీ దేనికైనా చేసినా చెయ్యక పోయినా చేసినట్లయినా కనిపించాలిగా మరి

నిజంగానా అత్తయ్యగారూ నేను నిజంగా పనంతా ఆవిడే చేస్తుందనుకుంటున్నాను సుమండీ అంది అమాయకంగా



## ఎదవీణ మ్రోగిన వేళ

విమలమ్మ మూతి ముప్పై వంకర్లు తిప్పుకున్న వైనం వనజ మాత్రం గమనించింది

వనజ వయస్సుకు చిన్నదే కానీ అమ్మలక్కల కబుర్లంటే మాత్రం చెవి కోసుకుంటుంది భర్తను అలా ఆఫీసుకు పంపిస్తూనే అటు విమలమ్మ ఇంటికి గానీ ఇటు జానకమ్మ ఇంటికి గాని వచ్చి కూర్చుంటుంది కబుర్ల కాలక్షేపానికి

వనజకు సాకేత అంటే ఇదీ అని తెలియని అసూయ దానికి కారణం ఆడవాళ్ళకు సహితం మోహం కలిగించే సాకేత అందం కావచ్చు

తన కంటే ఎక్కువగా చదువుకున్న ఆమె చదువు కావచ్చు

అమాయకంగా ఉండే ఆమె ప్రవర్తన కావచ్చు

సాకేత గురించిన ప్రసక్తి ఏదో తెస్తూ జానకమ్మగారు మూతీ - ముక్కూ విరుస్తూ ఏదో ఒకటి అంటుంటే విని ఆనందిస్తూంటుంది వనజ

జానికమ్మ ఒదినా! కాసిని మంచినీళ్ళు ఇవ్వమ్మా ఏవిఁటో వెధవది ఎండా కాలంలా నోరొకటి ఎండిపోతోంది

ఔను పిన్నిగారూ నాకూ అలాగే ఉంది అందుకుంది వనజ

మామూలుగా అయితే జానకమ్మ సత్యా! కాసిని మంచి నీళ్ళు పట్టుకురా ! అంటూ ఇంట్లోకి కేకపెట్టేది

కానీ భోజనం చెయ్యగానే నడుం వాల్చిన కోడలిమీద ఆవిడకు కోపంగా ఉంది

అందుకే పని మాలా లేచి లోపలికి వెళ్ళింది

వనజా జానకమ్మవన్నీ మాటలుగానీ కోడలు పని చెయ్యకపోతే ఈవిడ ఊరుకుంటుందీ ? అంది రహస్యం చెబుతున్నట్లు లో గొంతులో

అదేవిఁటి పిన్నిగారూ! తన కోడలు పని చెయ్యదు అని చెబుతున్నారుగా జానకమ్మత్తయ్యగారు అమాయకత నటించింది వనజ

ఆఁ మాటలకేంలే ఇంటి ప్రక్కనేగదా! నేను చూడటంలా లేచిన దగ్గర్నుండీ మళ్ళీ పడుకునే వరకూ ఆ పిల్ల నడుం విరిగేలా చాకిరీ చేస్తూనే ఉంటుంది ఈవిడగారు ఇటు పుల్ల తీసి అటు పెట్టదు

అహఁ అలాగా !

వనజా! ఈ సంగతి నీకు తెలుసా

ఏవిఁటి పిన్నిగారూ ?

ఎలాగూ కోడలు కాపురానికి వస్తుందిగదాని పని మనిషిని మానిపించేసింది ఈ తల్లి

అహఁ

జానకమ్మ మంచి నీళ్ళు తెస్తున్న అలికిడి అవడంతో విమలమ్మ సర్దుకుని, వనజా మీ ఆయన క్యాంపుకు వెళ్ళినట్లున్నాడు వచ్చాడా ? అంది పెద్దగా

లేదు పిన్నిగారూ రేపొస్తారనుకుంటాను

జానకమ్మ ఇద్దరికీ మంచి నీళ్ళు ఇచ్చింది

తను మంచి నీళ్ళు తెచ్చేందుకు వెళ్ళినప్పుడు విమలమ్మా, వనజా ఏదో రహస్యంగా మాట్లాడుకున్నట్లు పసి కట్టింది జానకమ్మ

ఆ విషయమేదో వనజ ఒంటరిగా దొరికినప్పుడు రాబట్టాలని నిశ్చయించుకుంది

మాటల మధ్యలో విమలమ్మ మంచి నీళ్ళు అని అడిగినప్పుడే ఆమెకా అనుమానం కలిగింది

జానకమ్మను లోపలికి పంపి వనజతో ఆ విషయం చెప్పేవరకూ ఆగలేకపోయింది విమలమ్మ

(ఇంకా ఉంది)



## జలుబూ, పడిశెంతో పాపకి కంటికి కునుకులేదు

# విక్స్ వేపోరబ్‌తో యిక ఆ రాత్రే హాయిగా నిద్ర పట్టింది

## (అప్పుడే మరి తల్లి మమత కనిపించేది)

ఈ జలుబుతో వచ్చిన తిప్పలేమిటంటే, తన దాకా వస్తేనేగాని తెలియదు మరి. అవడానికి మామూలు జలుబే, కాని దాంతో రాత్రంతా నిద్రకి నోచుకోరు. యిక ముక్కు దిబ్బెడ వెయ్యడం, కారడం. ఖళ్ళు - ఖళ్ళుమని దగ్గు, ఒళ్ళంతా నెప్పులూను. పడిశెం పది రోగాల పెట్టు! పసిపాప ఎలా భరించగలదు గనక! అటువంటప్పుడేగదా తల్లి ఆపేక్ష, చల్లని చేతుల చమత్కారం కనిపించేది- పాప ముక్కుకి, గుండెలకి, గొంతుకి, వీపుకి ఆ ఆపేక్షతో విక్స్ వేపోరబ్ రాసినప్పుడు. ఆ వీపుమీద విక్స్ వేపోరబ్ రాయడం మర్చిపోకండేం? అలా చెయ్యకపోతే, మీరు పడ్డ శ్రమంతా అపూర్తంగానే ఉండిపోతుందిక. మమతతో నిండిన మాలీసుతో తన క్రియని ప్రారంభిస్తుందిక. దీనిలోని ఔషధీయుక్తమైన ఆవిరితో ముక్కుదిబ్బెడ పోతుంది. మరి దాంతోనే శరీరంపైన దీని ప్రభావంతో ఒంటి నెప్పినుంచి ఉపశమనం కలుగుతుంది.

ఈ రకంగా మమతతో నిండిన ఉపచారంతో పాప హాయిగా నిద్రపోతుంది. యిక ప్రొద్దున్నే కళ్ళు తెరవగానే మునపటిలాగా కులాసాగా వుంటుంది.




## విక్స్ వేపోరబ్

**ఇస్తుంది హాయిగా**
**ఊపిరి పీల్చుకునేలాంటి ఉపశమనం**
**ఇక కులాసాగా ఉండగలిగే అనుభవం.**

# పిల్లలు-నిద్ర

## పిల్లలు వారి మానసిక ప్రవృత్తులు



డాక్టర్ (శ్రీమతి) జయా నాగరాజు
మానసిక వేత్త

నిద్రపోవటం పసి పిల్లల జీవితంలో ప్రధానం. వయస్సు ఎంత తక్కువ అయితే అంత ఎక్కువగా నిద్ర అవసరం. ఎప్పుడూ చురుకుగా వుండే శరీరానికి, మనస్సుకు విశ్రాంతి కలుగజేస్తుంది నిద్ర. పిల్లలు వంటరిగా పడుకున్నప్పుడు మాటి మాటికీ లేవడం. మంచి నీళ్లు కావాలనో "వకటికి" వెళ్లాలనీ నిద్ర రావడం లేదనో అమ్మ ప్రక్కన పడుకుంటామనో ఏదో ఒకటి చెప్పుతూగానీ నిద్రకుపక్రమించరు. దీనికంతా వంటరితనాన్ని భరిచలేనితనమే కారణం. రెండు మూడేండ్ల బిడ్డలలో నిద్రాభంగంలో అనేక లక్షణాలు పలు విధాలుగా అగుపిస్తాయి. నిద్రలో ఏడ్వడం, నవ్వడం భయకంపితోద్వేగం, మాట్లాడ్డం, మొదలైనవి చేస్తూ వుంటారు. ఎదుగుతున్న వయస్సు, తమ చుట్టూ వున్న వాతావరణం, తెలుసుకోగలుగుతున్న సంఘటనలు.... అన్నీ ఈ పరిణామానికి కారణం. జాగరూకతలో వున్న పగటి పూట జరిగిన విషయాలు రాత్రి మరల మెదడు నెమరు వేస్తుంది. అది కలగా మారుతుంది.. ఆ సందర్భంలో పిల్లలు మాట్లాడడం, వులిక్కిపడడం, నవ్వడం చేస్తుంటారు. ఇక్కడ "మా బాబు నిదురలో నవ్వుకుంటాడు... ఏ దేవతలతో అచ్చెకాలాడెనో..." అని ఓ తల్లి తన బాబు గురించి పాడిన పాట గుర్తుకొస్తూ వుంటుంది.

"అమ్మా నాకు నిద్ర రావడం లేదే.... కథ చెప్పవే" అనో, "నువ్వెందుకు కూర్చున్నావు? పడుకో... నాతో నే పడుకో" అని వేధించే పిల్లలను కసరికొట్టడం "ఛీ భడవా పడుకో.." అని కొట్టడం చేస్తారు కొందరు. అలా కాకుండా ప్రతి రోజూ ఒకే వేళకు పిల్లలను నిద్ర పుచ్చడం, వాళ్ళు పడుకునేటప్పుడు ఓపికతో కథలు-గాని జోలపాటగాని, ఆహ్లాదకరమైన సంగతులుగాని చెప్పుతూ పిల్లలను నిద్రపుచ్చడం మంచిది. కాని టి.వి.లో సినిమా చూడాలనే ఆతృతతో త్వరగా నిద్రపోని చంటాణ్ని తిట్టి కసురుకొని దబదబా వీపు మీద తట్టి పడుకోమంటే ఆ పిల్లాడు నిద్రపోడు సరికదా ఏదో ఒక సాకుతో మారాం చేస్తాడు...

దానితో తల్లికి సహనం తగ్గిపోయి మరీ కఠినంగా పిల్లవాడి పట్ల ప్రవర్తిస్తుంది. వాడు మరీ అల్లరి చేస్తాడు, నిద్రపోడు, కొన్నాళ్లకిదొక అలవాటుగా మారుతుంది. నిద్రా సమయం తల్లి బిడ్డల మధ్య ఓ సమరాన్ని లేవదీస్తుంది. కాని ఓపికతో ఆ నిద్ర పుచ్చే సమయం ఆనందదాయంకంగా మారుస్తే నిద్రలో వచ్చే అవాంతరాలు, సంఘటిల్లే నిద్రాభంగాలు తీరిపోతాయి.

నిద్రలో సహజంగా జరిగే ఉత్పాతాలు వయస్సుతో కలిగే సహజ సమస్యలకు ప్రతి రూపం... వయః పరమైన సమస్యలు ఆందోళనను కలుగజేస్తాయి. మనస్సు కుంటుపడిన దశలో నిద్ర పట్టదు. పట్టినా కలలు రావడం... ఆ కలలో కూడా మనస్సు బెంబేలు




పడ్డ కారణాలే స్ఫురిచడం, అటుపై కల చెదిరిపోయి మెలుకువ రావడం పిల్లవాడు భయ విచలితుడు కావడం జరుగుతుంది. వాస్తవిక జాగ్రదావస్థలో ఏ ఒక్క భయ కంపిత సంఘటనకు తగినంత రక్షణ లేకపోతే ఈ సంఘటనే మరల మరల గుర్తుకు వచ్చి నిద్ర లేమిని కలుగజేస్తాయి. పగటి పూట ఆడు-కుంటున్న బాబును మొరుగుతూ ప్రక్కింటి కుక్క ఆకతాయితనంగా తరుముకు వస్తే ఆ సమయంలో "కుక్క" అనే దాని గురించి భయపడిన పిల్లవాడు నిద్రలో కూడా కుక్క గురించి భయంతో కలవ-రిస్తూ, దాని గురించే కలలుగంటూ, వులిక్కి పడి లేస్తాడు. రాత్రి పూట ఎక్కడో పని మాలి అరిచే కుక్కల అరుపు విని దాని గురించే ఆలోచిస్తూ నిద్ర పట్టక బాధపడడం కద్దు...

కొందరు తల్లులు పిల్లలకు నిద్ర వచ్చేటందుకు ఓ బొమ్మను పట్టుకొని పడుకోవడం అలవాటు చేస్తారు. ఇక ఆ ఆటబొమ్మ వుంటేనే గాని నిద్ర పట్టదు. ఆ అచేతనమైన బొమ్మ ఆ బిడ్డకు ధైర్యాన్ని కలిగించే వస్తువుగా (సెక్యూరిటీ సింబల్) మిగిలి-పోతుంది. ఆ బిడ్డకు ఆ బొమ్మకు ఓ అవినాభావ సంబంధం ఏర్పడుతుంది. ఆ బొమ్మగాని పోయిన-నాడు మహా బాధ పడడం, నిద్ర పోలేకపోవడం జరుగుతుంది.

మరి కొందరు బిడ్డలు చేతి బొటన వ్రేలినో, లేక చూపుడు, మధ్య వ్రేళ్లను చీకుతూ నిద్ర పోవడం అలవాటు చేసుకుంటారు మంచి నిద్రలో వున్నప్పుడు ఆ వ్రేళ్లను నోటి నుండి తీసివేసినా అసహనంగా మూల్గి మరల ఆ వ్రేళ్లను నోట్లో పెట్టుకుంటారు. ఇది తమకు తాము ధైర్యం చెప్పుకునే పద్ధతులలో ఒకటి. (సెల్ఫ్ సెక్యూరిటి) ఏదో ఒక వస్తువును నిర్బంధావస్థగా (కంపల్షన్) తమ వద్ద వుంచు-కోవడం... ఆ వస్తువు తమ వద్ద వున్నంత సేపూ తమకే హానీ రాదని ధైర్యంగా వుండడం అలవాటు-చేసుకుంటారు మరి కొంత మంది పిల్లలు. ఇవన్నీ వ్యక్తిగతంగా పిరికివారు, తమ పరిసరాలంటే భయపడేవారు, తోడు కావలసినవారు ఏదో ఒక దాని మీద మమత మమకారాలను పెంచుకునే పిల్లలు, నిద్రకే ఆధారంగా వుపయోగించేవారు (నైట్ కోఫ్) వీటికి అలవాటు పడతారు. ఇవన్నీ తల్లిదండ్రులు తమ బిడ్డలతో కావలసినంత ధైర్యాన్ని కలుగజేయక-పోతే వచ్చే అలవాట్లు అని చెప్పాలి.

ఇంట్లో ఏదైనా కార్యక్రమం వుంటే ఈనాటి ఆధునిక పద్ధతులను అవలంభించే తల్లిదండ్రులు తమ పిల్లలు త్వరగా నిద్రపోవాలని, తమ కార్యక్రమాలకు అడ్డుగా వుండకూడదని, తమ పనులలో పానకం-

# ధర్మపథం



—బులుసు వేంకటరమణయ్య

# తొందరపాటు

తొందరపాటు మానవులలో ఉన్న బలహీనతలలో ఒకటి దాని వల్ల ఎన్నో చిక్కులూ, అనర్థాలూ సంభవిస్తాయని అందరికీ తెలుసు అది మానవులలోనే కాక మానవేతరులైన దేవదానవులలో కూడా కానవస్తుంది త్రిమూర్తులలోని బ్రహ్మ మహేశ్వరుడు కూడా తొందరపాటు వలన తమకే చిక్కులు తెచ్చుకున్నట్లు తెలుస్తున్నది మహేశ్వరుడు తొందరపడి భస్మాసురుడికి, అతడు చేయి పెట్టిన స్థలం భస్మమయ్యేట్లు వరం ఇచ్చి తనకే ఉపద్రవం తెచ్చుకున్నాడు మోహినీ రూపం ధరించిన విష్ణువు వల్ల ఆ అపాయం తప్పినది

బ్రహ్మదేవుడు దశకంఠుని తపస్సుకు మెచ్చుకొని, అతడు కోరినట్లు నర, వానరుల కంటె ఇతరులైన దేవదానవాదులవల్ల తనకు చావు లేకుండునట్లు వరం అనుగ్రహించాడు అందువల్ల రావణుడు ధైర్యం వహించి, దేవతల మీదికే దాడి వెడలడం ప్రారంభించాడు సూర్యుని వంటి వాడే అతనిని ఎదిరించలేకపోయాడట! తనతో యుద్ధం చెయ్యని వాడు ఓడిపోయినట్లు ప్రకటిస్తూ రావణుడు యముని పట్టణం మీదికి దండెత్తి వెళ్లాడు నరక లోకంలో వివిధ నరక బాధలను అనుభవిస్తున్న ప్రేతల కందరికీ విముక్తిని కలిగించి, యమకింకరులను బాధించి యముని కోపానికి గురి అయినాడు తర్వాత దశకంఠునికీ, యమునికీ తీవ్రమైన యుద్ధం జరిగింది చివరకు యముడు రావణునిపై తన అప్రతిహతమైన కాల దండాన్ని ప్రయోగించుటకు సంసిద్ధుడైనాడు

ఆ కాలదండం యమునికి బ్రహ్మ యిచ్చినదే! అది అమోఘమైనదనీ, దానిని ఎవరి మీద ప్రయోగించినా అతడు మరణించక తప్పదనీ కూడా బ్రహ్మ శాసించాడు అందువల్ల ఆ కాల దండం ప్రయోగిస్తే రావణుడు చావక తప్పదు కాని, రావణునికి దేవతల వలన మరణం ఉండదని బ్రహ్మదేవుడే వరమిచ్చాడు కనుక అతడు మరణిస్తే బ్రహ్మ యిచ్చిన వరం వ్యర్థమయి, బ్రహ్మకు అపఖ్యాతి కలిగిస్తుంది మరణించకపోతే కాల దండం నిష్ప్రయోజనమై, దాని వల్ల కూడా బ్రహ్మ మాట పొల్లయిపోతుంది ఈ విషమ పరిస్థితిని తెలిసకొని వెంటనే ఆ పరమేష్ఠి ప్రత్యక్షమయి, కాలదండ ప్రయోగం నుంచి యముణ్ణి వారించి 'నా మాట పొల్లు కాకుండా చెయ్యవలె'నని కోరాడు అతని కోరిక ప్రకారం యముడు యుద్ధాన్ని మానుకోవలసి వచ్చింది బ్రహ్మ రావణుణ్ణి అక్కడ నుండి పంపివేశాడు వెనుకకు పోతున్న రావణుడు తాను యముణ్ణి జయించినట్లే సంతోషించాడు

అనాలోచితంగా తొందరపడ ప్రవర్తించడం దేవతల్లో అతి ముఖ్యులలో కూడ ఉన్నదని దీని వల్ల తెలుస్తున్నది □

లోని పుడకలాగా పదేపదే అడ్డు తగలకుండా వుండాలనే వుద్దేశంతో వారిని నిద్రపుచ్చుతారు కాని మూడు నాలుగేండ్లున్న పిల్లలకు యింట్లో అలజడి, కోలాహలం సంబరం, జరుగుతుంటే నిద్ర ఎలా వస్తుంది? ఇంట్లో జరిగే సంబరం ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలం కూడా వుంటుంది ఆ కుతూహలం కొద్దీ పిల్లలు నిద్రపోకపోవడమో, లేక యింట్లో జరిగే అలికిడికి లేచిపోయి అమ్మ కోసం మారాం చేయడమో జరుగుతుంది పిల్లలను మినహాయించి సంబరాలుచేసుకోవడం వల్ల పిల్లల వ్యక్తిత్వం మీద దెబ్బ తీయడమే జరుగుతుంది

అలవాటైన వ్యక్తులు, పరిసరాలు, వస్తువుల నుండి పిల్లలకు వియోగం కలిగినప్పుడు కలిగే దిగులు, ఆందోళన నిద్ర లేమికి దారి తీస్తాయి (సపరేషన్ యాంయిగ్జయిటీ) రాగద్వేషాలు ఇష్టాయిష్టాయి వ్యక్త పరిచే వయస్సులో పిల్లలు మానసిక అలజడికి లోనై నిద్రను కోల్పోతారు చంటి బిడ్డను ప్రక్కలో వేసుకొని యింకా బాల్యం ముగియని ఎడ బిడ్డను దూరం చేస్తారు

దీనితో చంటాడి మీద ద్వేషంతో నిద్రపోడు పెద్దవాడు కొంత మంది పిల్లలను నిద్రపోనిచ్చి ఏ ఆయానో బొమ్మనో చూచుకోమని వప్పగించి తాము రెండో ఆట సినిమాకు దారి తీస్తారు ఇంతలో పిల్లాడు లేచి తల్లితండ్రులు లేరని తెలుసుకొని మారాం చేయడం, నిద్ర పోకుండా వారి రాక కోసం ఎదురు చూడడల అలవాటు చేసుకుంటాడు అదే కాకుండా తన్ను మోసగించి వెళ్లిన తల్లిదండ్రుల మీద నమ్మకం పోయి తాను నిద్ర పోతే వారెక్కడ తనని వదలి పోతారేమోననే అనుమానంతో చాలా రాత్రి వరకూ నిద్ర పోకుండా మేలుకొని వుండి తల్లితండ్రులను ఎటూ పోకుండా కాపలా కాస్తుంటాడు ఇది నమ్మక లేమి, వంటరి తనాన్ని భరించలేకపోవడం మూలంగా జరుగుతాయి జీవితంలో తన వారు అనుకున్న వారి మీదే అనుమానం అపనమ్మకంతో పెరిగే పిల్లల మనస్తత్వం ఎలాగూంటుందో, వారు పెరిగి పెద్ద వారైన పిదప ఎలా వుంటారో వేరే చెప్పనవసరం లేదు

నిద్రలో నడవడం లేచి సదా చేసే పనులు చేసుకోవడం మంచం చుట్టూ తిరగడం, లాంటి పనులు పిల్లలు చేస్తారు అదంతా నిద్రావస్థలోనే జరుగుతుంది దీనికి నిద్రావస్థా జాగృతి (సోమ్నాంబ్యులిజమ్) అంటారు ఇది ఒక మానసిక రుగ్మతా వస్థ

కడుపు నొప్పి, చెవులో పోటు, కడుపుబ్బరం మొదలైన శారీరక బాధలతో నిద్ర లేకపోవడం చిన్న బిడ్డలలో కలుగుతుంది నిద్ర లేమి మానసిక వికాసానికి శారీరక పెంపుకు పెట్టని ఓ అడ్డు గోడ చక్కగా నిదురపోయి లేచిన బిడ్డ ముద్దుగా బొద్దుగా చురుకుగా చలాకీగా వుంటుంది □




### టి. ఆర్ – పొడలకూరు

నావయస్సు 14 సంవత్సరములు నాకు ఆరు సంవత్సరములనుండి కాలు వాపు వున్నది చాలా మంది డాక్టర్లకి చూపించినాము రాయవేలూరుకి గూడా వెళ్లి వచ్చాము ఫైలేరియా ఉని చెప్పారు బాండేజి గూడా కట్టినారు పని చేయకుండా బాండేజి కట్టుకొని పడకుంటె తగ్గుతుంది మరల స్కూలికి వెళ్లి రాగానే మామూలుగా వాస్తోంది

★ ఫైలేరియా రోగం మూలంగా కాలు వాచినప్పుడు పనిచేసినప్పుడు హెచ్చుతూ లేనప్పుడు తగ్గుతూ రాదు అనీమియా, హృద్రోగాలు, లివర్ దెబ్బతినటం మొదలయిన కారణాలవల్ల కాళ్ళు వాయటం జరుగుతుంది ఫిజీషియన్ల వద్ద మరలా పరీక్ష చేయించుకొనటం మంచిది

### ఎమ్.వి.ఎస్.వి.జి. – విశాఖపట్నం

మా అమ్మగారి వయస్సు 34 సంవత్సరములు ఎప్పుడూ తలనెప్పి అంటుంది కె జి హెచ్ లో ఎన్నో ఎక్స్‌రేలు తీసారు ఎన్నో మందులు వాడారు ఎన్నో నూనెలు గూడా వాడారు ఈ తలనెప్పి ఎందువలన వచ్చింది? ఇది తగ్గటానికి ఏవి చెయ్యాలి

★ తల నెప్పికి చాలా కారణాలు ఉన్నాయి ఇ ఎన్ టి, నేత్ర వైద్యం, న్యూరాలజీ, సైకియాట్రీ మొదలయిన విభాగాలలో నిపుణులచేత పరీక్షింప చేసుకోవటం అవసరం రోగ నిర్ధారణనుబట్టి చికిత్స చేయవలసి ఉంటుంది

### టి.ఎస్. – మద్రాస్

నాకు గొంతు క్రింద, గుండె మీద, పాదాల మీదా ముంజేతుల మీదా, ఎఱ్ఱటి పొక్కులు చిన్న చిన్నవి వచ్చినవి అప్పుడుపుడు దురద పెడుతూ వుంటాయి నేను యిక్కడ ఒక డాక్టర్‌గారిని అడిగితే ఆయన 'కెరాలిన్ ... ఆయింట్‌మెంట్ వాడమన్నారు నేను ఆ మందును వాడి ... రోజులు అయినది ఏమీ గుణము కన్పించలేదు

★ మీరు లోనికి యాంటీబయాటిక్ మాత్రలు వాడండి దీనితో బాటుగా పిరిటాన్ మాత్రలు రోజుకి రెండు వంతున, రెడాక్సాన్- 500 మి గ్రాముల మాత్రలు రోజుకి ఒకటి వంతున వాడండి పై పూతగా టెర్రాకార్ట్ ట్రిల్‌స్కిల్ ఆయింట్‌మెంట్ వాడండి □

## ఇప్పుడు... మీ చర్మ సమస్యలను కడిగి పారవెయ్యండి...
## మీ చర్మానికి శుభ్రమైన, ఆరోగ్యవంతమైన నిగనిగ ఇవ్వండి.

# Godrej నిమిన్

### శుద్ధమైన వేపనూనె యొక్క సహజ సద్గుణాలు కలిగినది.

నీమ్, మర్గోసా అన్న పేర్లతో పిలువబడే వేపచెట్టు, చర్మ సంబంధ సమస్యలకై మానవజాతికి ప్రకృతి ప్రసాదించిన వరాలలో ఒకటి వేపనూనెను క్రమం తప్పకుండా వాడితే, అది మీ చర్మం నునుపుగా, తేటగా ఉండడానికి తోడ్పడుతుంది

గోద్రెజ్, శుద్ధమైన వేపనూనెను చేర్చి రూపొందించిన సబ్బు, నిమిన్ — మీ చర్మ సమస్యలను కడిగి పారవేసే లగ్జరీ టాయిలెట్ సోపు ఈ గోద్రెజ్ నిమిన్ మరింతకాలం మన్నుతుంది. ఎందుకంటే ఇది ఇతర కొన్ని మర్గోసా సబ్బులవలె మెత్తబడిపోదు



**నిమిన్ – మీ అంత శ్రద్ధగా మీ చర్మాన్ని కాపాడే సబ్బు.**

CHAITRA-B G 230 TEL

## బ్రిటన్‌లో ఉపాధి కోల్పోయిన ఉపాధి కల్పన కార్యాలయం ఉద్యోగులు!

బ్రిటనులో ఎంప్లాయిమెంటు ఎక్స్‌చేంజిలో పనిచేస్తున్నవారిలో 1400 మందిని యిటీవల వారి ఉద్యోగాల నుంచి ప్రభుత్వం తీసేసిందట దీనికి కారణ మేమిటంటేప్రభుత్వం తన ఖర్చులు తగ్గించుకోవాలని తీసుకున్న నిర్ణయంలో ని అమలు పదకాల పలితమేనని చెప్పిందట– మనమే బెటరా!

## జైల్లో పెళ్ళి!

బర్మింగ్‌హామ్‌కు చెందిన జాన్ వెన్నెల్ అనే వో మన్మథుడు చేతి ముట్టు సరసం అదికమవడంతో జైలు పాలయ్యాడట కాని అతన్ని అన్ని తెలిసే ప్రేమించిన లిండాహంట్ అనే అమ్మాయి జైలులో వున్న అతన్ని అక్కడే వివాహం చేసుకుని వో దొంగ నా మానసచోరుడు అని ప్రకటించిందట

## మగని ఆట కట్టించిన మూడో భార్య!

బెల్గాంకు చెందిన శ్రీకాంత్ అనే వో కాంతాదాసుడు ముత్యంగా మూడు పెళ్ళిళ్ళు చేసుకుని నాలుగో పెళ్ళికి తొందర పడుతుంటే ఆతని మూడో బార్య సుశీల ఆతని నిజ స్వరూపం పోలీసులకు తెలియచేసి అతన్ని అరెస్టు చేయించిందట!

## మనుషుల్ని అమ్మే ఆధునిక వ్యాపారి!

కర్నాటకకు చెందిన చిక్మగళూరులో వో ఆదునిక వ్యాపారి రోజుకు 25 రూపాయలు వేతనం యిస్తానని 56 మందిని మభ్యపెట్టి వారిని ఒక్కొక్కరినీ రెండేసి






వేల లెక్కన గోవాకు చెందిన వో కంట్రాక్టరుకు తెగ నమ్మేడట – మనుష్యులనమ్మడం యీనాటిది కాదు అలనాడు హరిశ్చంద్రుడేఆది పురుషుడు

## మాతృ హంతకుని హృదయ పరివర్తన!

హామిల్టనుకు చెందిన 33 ఏళ్ళ జాన్ మిక్‌గిల్ అనే వో యువకుడు రోజూ పూటుగా తాగి రావడం భరించలేని అతని తల్లి (66 ఏళ్ళు) అతన్ని కసి తీరా తిట్టేసరికి కోపంలో అతను ఆమెను సుత్తితో కొట్టి చంపి పారిపోయి ఆనక పరివర్తన కలిగి తానుగా పోలీసులకు లొంగిపోయాడట

## ప్రాణం తీసిన నిద్ర!

రాణిపేటలో వున్న బెల్ కంపెనీలో పని చేస్తున్న 23 ఏళ్ళ సంపత్ రైలులో రోజూ తన సొంత పూరు గుడియాత్తానికి చెందిన మేల్‌పట్టి నుంచి వచ్చి పోతూంటాడట మొన్న 14 వ తేదీన రైల్లో నిలబడి నిద్రపోతూ, తాను దిగాల్సిన చోటులో దిగక రైలు బయలుదేరేక మెలకువవచ్చి హరెరే అనుకుని బట్టున రైలులోంచి దూకేశాడట విధివశాత్తు ఆ దూకడంలో రైలు క్రింద పడి అక్కడ కక్కడే ముక్కలై చనిపోయాట్ట

## సబల!

అమెరికాకు చెందిన బెల్ ఫ్రాంసెస్ అనే వో హామె ప్రపంచ స్త్రీలలో నే అతి బలశాలిట ఈమె బరువు 180 కిలోల బరువున్నదట ఒళ్ళు కండలు తిరిగి చూడ మగవాడికే దడపుట్టేట్టుందట ఈ మహిళా రత్నం పెళ్ళి కోసం ఎదురు తెన్నులు చూస్తోందట– అవడం కష్టం కాదా!

## బస్సు చరిత్ర!

ఈ రోజు బస్సు అని మనం అంటున్న వాహనం మొట్ట మొదట 1662లో ఫ్రెంచి దేశీయుడు పాస్కల్‌కనిపెట్టాడట అతడు వో పెద్ద చక్రాల బండి మీద బోడి కట్టి దానిని గుర్రాలతో తోలించి దానికి ఆమ్నిబస్ అని పేరు పెట్టాడట ఆనక 1829లో జార్జి షెల్లిబీర్ అనే అతను మూడు గుర్రాలతో దాన్ని కొంచెం మార్పులు చేసి ఆరంభించాడట ఆనకది అనేక రూపాలు మారి యీనాటి రూపం స్థిర పరచుకున్నదట

## మెదడు లేని శిశువు!

నాగపూరు మాతృ సేవా సంఘంకు చెందిన వో ఆసుపత్రిలో ఒకామెకు మంగళవారం 16వ తేదీన పుట్టిన శిశువుకు బుర్రలో మెదడు లేదట పదివేల జననాల్లో మహా అయితే వో యిద్దరు యిలాగ పుట్టిన బిడ్డలు కొన్ని గంటలుకన్నా సామాన్యంగా బ్రతకరట కానీ యీ బిడ్డ నలభై గంటలు బ్రతికి వున్నదట మెదడు వుండాల్సిన స్థానంలో ఏమీ లేదట తల్లి ఏ మందు పడితే ఆ మందు యిష్టా రాజ్యంగా మింగడం వల్ల యిలా జరగవచ్చని డాక్టర్లు అభిప్రాయపడుతున్నారట!

## వారకాంత అఘాయిత్యం!

సౌదీ అరేబియాకు చెందిన అబ్దుల్ అజీజ్ అనే వో రసికుడు జెనీవాలో వో వారకాంత యింటికి వెళ్ళి, ముడుపు చెల్లించి, ముచ్చటలో దిగాడట రోజ్ అనే ఆ పిల్ల చిత్తుగాతాగి, పేట్రేగిన ఉద్రేకంతో అతగాడి మర్మాయవాన్ని కోసి తీసేసి, అంతతో ఆగక, అతని తలను నరికి టేబులుమీద పెట్టి, అప్పటికీ ఉద్రేకం చల్లారక సీసా పగలగొట్టి, అతని పొట్ట చీల్చి ప్రేగులు బయటికి లాగిందట

## ఒకే రోజున 20 వేల మంది తల నీలాల సమర్పణ

తిరుపతిలో మొన్న అక్టోబరు 14 వ తేదీన సుమారు 20 వేల మంది భక్తులు తలనీలాలు సమర్పించి. నిగనిగ లాడుతున్న తలలతో గోవిందా అంటూ దర్శనం చేసుకున్నారట సుమారు 400 మంది నాయీ బ్రాహ్మలు యీ పని రాత్రీ పగలూ చేశారట ఆలయానికి యీ పని వల్ల 30 వేల రూపాయల వచ్చిందట □



ఉషా కిరణ్ మూవీస్

# కాంచనగంగ




దర్శకత్వం
వి.మధుసూదనరావు

నిర్వహణ
అట్లూరి రామారావు

నిర్మాత
రామోజీరావు

సీరియల్

# ఒక అమ్మ కథ: అన్నపూర్ణ

(గత సంచిక తరువాయి)

"అమృతా! దేశంలో సినీనటి కావాలని ఎంతోమంది ఆడపిల్లలు ఉబలాటపడు న్నారు ఈ వ్యామోహంలోపడి ఎందరో తమ వితాలనే బలిచేసుకుంటున్నారు ముక్కు ఖం ఎరుగకుండా ఈ మద్రాసు మహాపట్నం చ్చి అలాంటి వాళ్ళ దీనగాథలు చెప్పాలంటే నా గ్గిర చాలా ఉన్నయ్. అటువంటి తిప్పలు నీవు డలేదు అనుకోని అదృష్టంగా నీవు నా కంట డటం, నేను నీకు అవకాశం ఇవ్వటం జరిగింది వ్వు నటిగా ప్రవర్ధమాన మవ్వాలన్నదే నా పత్రయం అలాంటిది నా పట్ల ఏ మాత్రం కృతజ్ఞత లేకుండా ప్రవర్తిస్తావా నువ్వు?"— అడిగాడు భీమసేనరావు వచ్చి

"నన్నో మురికి కూపం నుండి బయటికి లాగి కొత్త జీవితాన్ని ప్రసాదించారు మీరు. అలాంటి మీపట్ల నాకు కృతజ్ఞత లేకపోవడమా బాబాయిగారూ?" అదోలా చూచింది అమృత

"నిజంగా నా పట్ల నీకు కృతజ్ఞతే ఉండి ఉంటే వీరేన్‌ను అగౌరవపరుస్తావా? అతడి మాటను తృణప్రాయంగా తీసివేస్తావా? జీవితంలో అభివృద్ధిలోకి రావాలంటే లౌక్యం, సర్దుబాటు ధోరణి లేకపోతే కష్టం అమృతా. నీ మొండితనంవల్ల ఇప్పుడు ఏం జరిగిందో చూశావుగా? మన సినిమా షూటింగ్ కాస్తా ఆగిపోయింది లక్షలు పెట్టుబడి పెట్టిన మంగారావు వెర్రి గంగిరిలెత్తి 'ఏం హీరోయిన్‌ని సెలక్ట్ చేశావయ్యా బాబూ' అని బండ బూతులే తిడుతున్నాడు ఈ సినిమా ఇలా అర్ధాంతరంగా ఆగిపోతే నా పరువు ప్రతిష్టలు ఏంగాను? ఇదంతా నీ వల్లే కద అమృతా జరిగింది? నా పట్ల నీ కృతజ్ఞత ఇంతేనన్న మాట!"

అమృతకు భీమసేనరావును చూస్తుంటే ఎంతో జాలి అనిపిస్తోంది

"వీరేన్‌గారి పట్ల నేను తప్పుగా ప్రవర్తించానని అభిప్రాయపడితే మీరు క్షమించండి జరిగిందేదో జరిగిపోయింది ఇప్పుడు నేనేమైనా చేయవలసింది ఉంటే చెప్పండి. మీపట్ల నాకుగల కృతజ్ఞతను రుజువు పర్చుకోవటంకోసం ఏమైనా చేస్తాను" అంది, ఒక నిర్ణయానికి వచ్చేసినట్లు భీమసేనరావు ముఖం విప్పారింది ఒక్కసారిగా

"అయితే ఈ రాత్రికి ఇక్కడ ఒక పార్టీ ఏర్పాటుచేస్తాను. మన యూనిట్ అందరితో పాటు వీరేన్ గారిని కూడా ఆహ్వానిస్తాను. పార్టీ అయిపోయాక ఈ గెస్ట్‌హౌస్‌లో మీరిద్దరే మిగులుతారు అతణ్ణి ఎలా ప్రసన్నుణ్ణి చేసుకుంటావో నాకు తెలియదు. మన సినిమా షూటింగ్ మాత్రం ఆగిపోకూడదు" అని అమృత సమాధానంకోసం కూడా ఎదురు చూడకుండా బయటికి వెళ్ళిపోయాడు భీమసేనరావు

## 30

హీరోయిన్ చంద్రవంక బర్త్‌డే పార్టీ పేరిట స్వల్ప వ్యవధిలోనే అన్ని ఏర్పాట్లు చేయించాడు భీమసేనరావు సాయంకాలానికల్లా టేబిల్స్, ఛైర్స్, తినుబండారాలు, డ్రింక్‌లు అన్నీ వచ్చేశాయి. ఇది నిజంగానే చంద్రవంక బర్త్‌డే అని నలుగుర్నీ నమ్మించడం కోసం ఓ స్వీట్ షాప్ నుంచీ రెడిమేడ్‌గా ఉన్న బర్త్‌డే కేక్‌ను తెప్పించాడు అమృతకు తలంటు స్నానం చేయించి అలంకారంగా తీర్చిదిద్దింది మంగతాయారు అన్నింటికీ తాను నిమిత్తమాత్రురాలినన్నట్లు ఊరుకుండి పోయింది అమృత.

సాయంత్రం ఏడుగంటలయ్యేసరికి ఒక్కొక్కరే రావటం మొదలుపెట్టారు అతి ముఖ్యులైన వాళ్ళకు భీమసేనరావు ఎదురువెళ్ళి స్వాగతం పలుకుతున్నాడు. అందరికంటే చిట్టచివర వచ్చింది హీరో వీరేన్ అతణ్ణి చూసి అందరూ గౌరవంగా లేచి నిలబడి తిరిగి అతడు కూర్చున్న తర్వాతే తామూ కూర్చున్నారు మొత్తంమీద పార్టీకి వచ్చినవాళ్ళు కొద్దిమందే

"చంద్రవంకగారి బర్త్‌డే పార్టీ ఈ రోజేనని మీరు మధ్యాహ్నం ఫోన్‌చేసి చెప్పారు అదే ఒకరోజు ముందు తెలియజెప్పి ఉంటే బావుండేది భీమసేనరావుగారూ" అన్నాడొక పెద్దమనిషి

"ఈవేళ తన పుట్టినరోజని ఉదయమే చెప్పింది మా చంద్ర నాకూను. ఎటువంటి ఆర్భాటాలు తనకు గిట్టవుట పార్టీ కూడా

**జరిగిన కథ — 11:** రాజారావు అమృత మధులకు అక్రమ సంబంధముందని ప్రచారం చేస్తాడు. ఇల్లు విడిచిపెట్టి వెళ్ళిపోతాడు అమృత తండ్రి ఇంటికి వచ్చిన రాజారావుకి బుద్ధి చెప్పి పంపిస్తుంది అమృత పిన్ని మేలుకోరి పెళ్లికి అంగీకరిస్తాడు మధు. రాజారావు మోసంతో అమృత శీలాన్ని హరించబోగా డ్రైవర్ సింహాద్రి ఆమెను రక్షిస్తాడు మధు భార్య పద్మ ఆనంద్ అమృతల పవిత్ర అనుబంధాన్ని అనుమానించి అవమానిస్తుంది పట్నంలో జరిగిన విశేషాలన్నీ భర్తతో చెప్తుంది అమృత మధు భార్య తన స్వంత పిన్ని కూతురు అని తెలుసుకొన్న రాజారావు ఆమెను చూసే నెపంతో మధు వాళ్ల ఊరు వెళ్లి అమృతను ఓ ఆట ఆడించాలనుకుంటాడు రాజారావు, అమృత మాటలు చాటునుంచి విని ఆవేశంతో రాజారావుని చంపాలని కర్రెత్తిన సుందరరామయ్య గుండెపోటుతో మరణిస్తాడు మనశ్శాంతికై అమృతను కొన్నాళ్ళు ఆనంద్ దగ్గరకు పంపను అంగీకరిస్తాడు మధు. ఆనంద్ దగ్గరకని బయలుదేరిన అమృత అతని దగ్గరకు వెళ్ళకుండా జగన్ వెంట విజయవాడ వెళుతుంది అమృతను సోషల్ వర్కర్ లలితాబాయి దగ్గరకు తీసుకెళతాడు జగన్ లలితాబాయి సేవాసదనం ఒక వ్యభిచార గృహం అని తెలుసుకొన్న అమృత కృంగిపోతుంది ఆమె సినీ డైరెక్టర్ భీమసేనరావు సహాయంతో లలితాబాయి చెరనుంచి తప్పించుకొంటుంది. అమృత 'చారెడేసికళ్లు' సినిమాలో హీరోయిన్‌గా బుక్ అవుతుంది 'చారడేసికళ్లు'లో హీరో వేషం వేసే వీరేన్ అమృత తనను అగౌరవపరిచిందని ఆ చిత్రానికి మరో హీరోయిన్‌ను బుక్ చేస్తేగాని తను షూటింగ్‌లో పాల్గొనేది లేదని అతడు కొందరితో అన్నట్లు తెలుసుకొన్న ఆ చిత్ర నిర్మాత మంగారావు, డైరెక్టర్ భీమసేనారావు వీరేన్ దగ్గరకు వెళ్తారు.

వద్దంది అలా వీలులేదని నేనే వ్యవధి ఎక్కువలేక పోయినా నాకు తోచిన ఏర్పాట్లు చేయించాను'' అర్ధాంతరంగా పార్టీ ఏర్పాటుకు కారణాలను వెదికి సభాముఖంగా అందరికీ వివరించి చెప్పాడు భీమసేనరావు.

అటుపైన ఫార్మాలిటీలన్నీ జరిగిపోయాయి అమృత బర్త్‌డే కేక్‌ను కోసింది 'హాపీబర్త్‌డే టుయూ' అంటూ అదరూ ఆమెను దీవించారు. తర్వాత ఎవరికివారు వచ్చి తాము తెచ్చిన బహూమతులను స్వయంగా చంద్రవంక చేతికి అందించి ఓ విధమైన తృప్తి ఫీలయ్యారు అంతా.

ఒకరిద్దరు ఆడంగులు, ''నిజంగా మీ అదృష్టాన్ని తలుచుకొంటుంటే అసూయ కలుగు తోంది మాకు. ముచ్చటైన మీ ముఖం, ఆ విశాలమైన కళ్లు చూస్తుంటే ఆడవాళ్లం మాకే అదోలా వ్యామోహం అనిపిస్తోంది ఇక మగవాళ్ల సంగతి వేరే చెప్పాలా ?'' అంటూ తమ అభిప్రాయాలను చెప్పి తప్పుకున్నారు

చిట్టచివరన హీరో వీరేన్ లేచి స్టయిల్‌గా నడుస్తూ వచ్చి అమృత చేతిని చొరవగా అందుకొని తను ఘనంగా తెచ్చిన ఓ ఖరీదైన ఉంగరాన్ని ఆమె చేతి వేలికి తొడిగాడు. మరికాసేపు ఉంగరం తొడిగిన ఆ చేతిని అలాగే పట్టుకొని అమృత కళ్లలోకి చూశాడు. చివరికి ఆమే తన చేతిని వెనక్కు లాక్కోవలసి వచ్చింది.

మరో అరగంటకల్లా పార్టీ అయిపోయింది పెట్టినవి తిని, ఇచ్చినవి త్రాగి కృతజ్ఞతలు తెలియజేసి వెళ్ళిపోయారు అంతా. ఒక్క వీరేన్ మాత్రం అక్కడే ఉండిపోయాడు.



# ఒక అమ్మ కథ

భీమసేనరావు మంగతాయారును పిలిచి, ఆమె చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు ఆ వెంట ఇద్దరూ క్రిందికి వెళ్ళిపోయారు. ఇక అక్కడ మిగిలింది వీరేన్, అమృత.

సంభాషణ ఎలా ప్రారంభించాలో తోచనట్లు ఉండిపోయారు ఇద్దరూ. తర్వాత వీరేన్ 'నాతో వచ్చెయ్' అన్నట్లు సౌంజ్ఞ చేసి ప్రక్కగదిలోకి దారితీశాడు. అభ్యంతరం చెప్పకుండానే అతణ్ణి అనుసరించి వెళ్ళింది అమృత.

''నా గురించి ఇప్పటికైనా తెలిసిందా చంద్రా ?'' మంచం మీద విలాసంగా కూర్చొని అన్నాడు వీరేన్.

''మీ గురించి మొదటిరోజు స్టూడియోలోనే తెలసింది నాకు'' అంది అమృత.

''ఓ ! ఐతే ఆనాటి చెంపదెబ్బను నువ్వింకా మరిచిపోలేదన్నమాట'' అంటూ నవ్వాడు.

''దెబ్బతిన్నదాన్ని నేను కద ?''

''నిజమే. సరేగాని, ఇప్పటి నీ సమాధానమేమిటి ?''

''ఆనాడే చెప్పాను. మనసుతో పనిలేదు, శరీరమే చాలు అనుకొంటే ఈ కట్టెను ఏమైనా చేసుకోండి. నాలోమాత్రం ఇష్టాలంటూలేవు.''

''ఆడదాని శరీరమే ముఖ్యం అనుకొంటే ఈక్షణాన వందమంది బజారు బొమ్మలను తెచ్చి నా ముందు పెట్టుకోగలను. కానీ, శరీరంతో పాటు మనసూ ప్రధానమే నాకు.''

''అది అసంభవం ఎలాంటి అందచందాలు భోగభాగ్యాలు నా మనసును స్పందింపజేయలేవు మనసు— అది దైవదత్తమైంది. శరీరం— పరిస్థితులకు బానిస. భీమసేనరావుగారు తన పిక్చర్ అర్ధాంతరంగా ఆగిపోతోందని దిగాలుపడి పోతుంటే— ఆయన మాట కోసం ఇలా మీ ముందు నిలబడవలసి వచ్చింది.''

''నిన్ను బానిసగా చూడాలనీ, నీ శరీరమే ముఖ్యమనీ అనుకొంటే ఆరోజు రాత్రి— మన ఔట్‌డోర్ షూటింగ్ లొకేషన్‌లోనే—బలవతంగా నైనాసరే నా కోర్కె తీర్చుకొనేవాణ్ణి. అక్కడ నన్ను ఎవరూ అడ్డుకొనేవాళ్ళు కారు. పైగా సహకరించేవాళ్ళు తెలుసా ? కానీ, చంద్రా ! అది నా తత్వం కాదు మనస్ఫూర్తిగా అంగీకరించిన ఆడదాన్ని కోరుకుంటాను తప్పితే మానసిక స్పందన లేని తోలుబొమ్మను పొందటానికి నేను ఇష్టపడను.''

అలా మాట్లాడుతున్న వీరేన్ వైపు చిత్రంగా చూస్తూండి పోయింది అమృత

'తెరమీద నటించినంతమాత్రాన జీవితంలోనూ నటించాలని ఎక్కడ ఉంది? ఆశ్చర్యపడనంటే ఒక నిజం చెబుతాను చంద్రా ! నన్ను గురించి నేను లోతుగా పర్యావలోకన చేసుకోవటానికి ప్రేరణ నువ్వే ఆనాడు నిర్మొహమాటంగా నీవు అన్న మాటలు నాకో పెద్ద షాక్ ఆ తర్వాత నీకు మొఖం చూపించటానికి సిగ్గనిపించి షూటింగ్‌కు రావటం మానేశాను. దీనిమీద మంగారావు, భీమసేనరావు, వేరే విధంగా అర్థం చేసుకున్నారు అంతా తప్పు నీదని నిందించారు. ఒంటరిగా కలుసుకొని నీతో మనసు విప్పి మాట్లాడాలని భీమసేనరావుకు చెప్పి ఈ ఏకాంత సమావేశం ఏర్పాటు చేయించాను. అంతేగానీ నీమీద నాకు ఎలాంటి కసి లేదు. నీ కారణంగా పిక్చర్ అర్ధంతరంగా ఆగిపోయేలాచేసి మంగారావును నష్టపరచాలనీ, భీమసేనరావును కించపరచాలనీ అనుకోవటం లేదు. ''

''మీలో ఈ మంచితనం చూస్తుంటే నాకెంతో ఆనందం అనిపిస్తోంది వేరేన్‌గారూ''

''నేను ఒక మనిషినే కాబట్టి నాలోనూ మంచి, మానవత్వం ఉన్నాయి చంద్రా ! కాకపోతే 'నేనే గొప్ప' అన్న వ్యక్తిగత అహంభావం వల్ల, ప్రయాస ఎక్కువ లేకుండానే వస్తున్న లక్షల డబ్బు, పెరిగిపోతున్న ఆస్తిపాస్తులు, వాటిని బట్టి వచ్చే హోదా దర్పం— ఇవి నాలోని ఆ మంచి మానవత్వాలను మరుగునపడిపోయేలా చేసాయి. మహా నటుడుగా నాకు పేరు ఉంది కాల్‌షీట్ల కోసం సంవత్సరాలతరబడీ వెయిట్ చేసి నాతోనే తాము పిక్చర్ తీయాలనే మొండి నిర్మాతలున్నారు ! వచ్చిపోయే సినీ పెద్దలకో ఒక తీర్థంలా ఉంటుంది మా ఇల్లు ప్రతి ఉదయం. ఎంతటి నటి అయినా నాతో మాట్లాడాలని ఉబలాట పడుతుంది. నన్ను ఆకట్టుకోవటానికి తాపత్రయ పడుతుంది కోరీ కోరకముందే సంతోషంగా తన శరీరాన్ని వప్పగించటానికి సిద్ధపడుతుంది 'మీతో గడిపిన ఈ క్షణాలు ఈ జీవితంలో మరచిపోలేను' అని పొగిడి మరీ వదులుతుంది. నేను కూడా అలాంటి వాళ్ళ అభ్యున్నతికి తోడ్పడటానికి ప్రయత్నిస్తుండేవాణ్ణి. అవసరం తీరటం నా స్వార్థం అయితే, నా ద్వారా లబ్ధి పొందటం వాళ్ళ స్వార్థం. కానీ, అందుకు భిన్నమైన వ్యక్తివి నీవు. ఈ సినీరంగంలోని ఉజ్వల భవిష్యత్తును వదులుకుపోవటానికి సిద్ధపడిననటివి నిన్నే మొదటి సారి చూశాను ఆనాడు నువ్వు నటుడుగా నాకు వుండవలసిన లక్షణాలను, నిజజీవితంలో నేను నిర్వర్తించవలసిన పాత్రను గురించీ కుండ బద్దలు కొట్టినట్లు నా ముఖానే చెప్పావ్ అదొక పశ్చాత్పరిణామం ఈ రంగుల సినీ ప్రపంచంలోకి వచ్చాక నన్ను ఎదిరించిన మొదటి నటివి నువ్వు నీ మాటలతోనే నాలోని అహంకారం దెబ్బతిని నన్ను గురించి నేను ఆలోచించుకోవటం మొదలు పెట్టాను. రెండోరోజు ఔట్‌డోర్ షూటింగ్ జరగకుండా నేను తొందరపడి వచ్చేయటానికి కారణం నీ మీది కోపంకాదు నాలో కలిగిన పరితాపం ! అంతే చంద్రా ''

''కృతజ్ఞురాల్ని వీరేన్‌గారూ ! మహానటులు, సంఘంలో ఎంతో పేరు పలుకుబడి ఉన్నవారు అలాంటి మీరు ఒక అధమురాలినైన నా మాటలకు ఇంత విలువ ఇచ్చి, మానసికంగా అంత పరివర్తనతెచ్చుకున్నారంటే మీలో మహానటుడితో పాటు, మహావ్యక్తి కూడా ఉన్నాడనిపిస్తోంది. ఇందాక మీరు అన్నట్లే ప్రతి మనిషిలోనూ మంచి, మానవత్వం పుట్టుకతోనే వస్తాయి. ఐతే కొందరు పరిస్థితులను బట్టి వాట్ని బలవంతానా చంపేసుకుంటారు. కొందరు వాట్ని అటు చావనీయకుండా, ఇటు బ్రతకనీయకుండా ఊగిసలాటలోపెట్టి లోకాన్ని మోసంచేస్తూ, తాము మాత్రం సుఖంగా బ్రతికితే చాలని చూస్తారు. మరికొందరు ఎన్ని పరిస్థితుల తుఫానులనైనా తట్టుకొని తాము జీవించినంత కాలం తమలోని మంచి మానవత్వాలను



ప్రబతికిస్తూనే వుంటారు. ఈ కలుషిత వాతావరణంలో ఉండి కూడా మీరు ఇంతటి మంచితనాన్ని ప్రదర్శిస్తున్నారంటే మిమ్మల్ని మనసారా అభినందిస్తున్నానండీ ''

అలా సాగింది వాళ్ళ సంభాషణా సరళి ఆ సమావేశ పర్యవసానంగా ఇద్దరూ ఒకరి మనసును ఒకరు గ్రహించి ఒకరంటే ఒకరు సదభిప్రాయం ఏర్పరచుకున్నారు తప్పితే వాళ్లు ఇంకాలోతుగా తమ తమ వ్యక్తిగత జీవితాలలోకి వెళ్లలేదు. అందుకు సమయమూ, సందర్భమూ కలిసిరాలేదు ఆరోజు.

చివరికి అక్కడే పడుకొని నిద్రపోయాడు వీరేన్. అమృత వేరే గదిలో తను ప్రత్యేకంగా ఏర్పాటుచేసుకున్న దైవమందిరం దగ్గిరకువెళ్లి చాలాసేపు ధ్యాననిమగ్నమై అలాగే అక్కడే నిద్రపోయింది.

ఆమె ప్రతిరోజు ప్రాతఃకాలాన ఆ దైవ మందిరం ముందు కూర్చొని ఏకాగ్రతలో మునిగిపోతూండటం మంగతాయారు, భీమసేనరావు చాలాసార్లు చూశారు అటువంటప్పుడు ఎంత పిలిచినా ఆమె పలుకకపోవటమూ వాళ్లకు అనుభవమే వట్టి పాతకాలపు పిల్ల గొప్ప ఛాందసురాలు, ఎలాబ్రతుకుతుందోఅని వాపోవటం మినహా వాళ్ళిద్దరు ఏంచేయలేదు

వీరేన్ తెల్లవారు ఝామునే లేచి వెళ్లిపోయాడు ఎవరికీ చెప్పకుండా ఆ సమయంలో అమృత తన గదిలోనే నిద్రపోతూ వుంది.

అమృతతో రాత్రల్లా గడిపాడుగా వీరేన్— ఇక తమ పిక్చర్ షూటింగ్ పూర్తైనట్లే అని భీమసేనరావు ఎంతో ఆనందం ఫీలైయ్యాడు.

## 31

'చారెడేసికళ్లు' సినిమా షూటింగ్ పూర్తైంది. రీరికార్డింగ్ కూడా త్వర త్వరగా జరిగిపోతోంది 'ఈ చిత్రం అటు క్లాస్‌ను, ఇటు మాస్‌ను ఆకట్టుకొని తీరుతుందనీ, మాటలు మాణిక్యాల్లా వున్నాయనీ, పాటలు సుమధురంగా, కర్ణపేయంగా ఉన్నాయనీ, హీరోయిన్ చంద్రవంక నటన ఎంతో సహజంగా, గొప్పగా ఉందనీ, హండ్రడ్డేస్ ఫెస్టివల్‌కు ఢోకా ఉండదనీ'వాఖ్యానాలు చేశారు ప్రీవ్యూధియేటర్‌లో పిక్చర్‌ను తిలకించిన పెద్దలంతా ఇక ఆ చిత్రానికి సంబంధించి ప్రదర్శనా హక్కులు తీసుకోవటానికి చాలామంది డిస్ట్రిబ్యూటర్‌లు ముందుకు వచ్చారు కటింగ్‌లు లేకుండానే సెన్సార్‌బోర్డు వారి సర్టిఫికెట్ లభించింది రిలీజ్ డేట్ పత్రికా ముఖంగా ప్రకటించేశారు

''ఇక నేను వెళ్ళిపోతాను భీమసేనరావు గారూ ! పిక్చర్ షూటింగ్ పూర్తిఅయిపోయాక కూడా కొన్నిరోజులు రికార్డింగ్ పేరిట, మరికొన్నిరోజులు 'సెన్సార్ వాళ్ళు అభ్యంతరం పెడితే కొన్ని సన్నివేశాలు తిరిగి షూట్ చేయవలసివస్తుంది. నువ్వు లేకపోతే ఎట్లా అంటూ ఆపుచేశారు నన్ను. ఇప్పుడు అన్నీ అయిపోయాయి. పిక్చర్ రిలీజ్ డేట్ కూడా ఎనౌన్స్ చేసేశారు. మరి నేను వెళ్ళిపోవటానికి మీకు అభ్యంతరం వుండదనుకుంటాను?'' అంది అమృత ఆ సాయంత్రం తీరుబడిగా కూర్చొని వున్న భీమసేనరావుతో.

''ఎలా వెళ్తావ్, ఎక్కడికని వెళ్తావ్ అమృతా ? ఈ లోకం, మనుషుల గురించి నీకు తెలియంది ఏముంది ? ఇప్పుడు నీకు మరొక కొత్త సమస్య ఎదురవబోతోంది తెలుసా ? ఎల్లుండే మన పిక్చర్ విడుదలౌతోంది దాంట్లో ముఖ్యనటివి నువ్వే ! చిత్రం మొత్తంలో ఎక్కువగా కనిపించే నిన్ను బయటి జనం తేలిగ్గానే గుర్తిస్తారు. నానాహైరానా పడవలసి వస్తుంది నువ్వు వాళ్ళతో. ఎంత ప్రయత్నించీ ప్రశాంతంగా బ్రతకటం కష్టం బయటికివెళ్ళి'' అంటూ ఆమె ముందు కాళ్ళకు బంధం వేశాడు

''ఇక్కడ ఉన్నా నాకు అశాంతే భీమసేనరావుగారూ. అదీ గాకుండా సినిమాల్లో నటించాలనీ, నటిగా ఈ ఫీల్డులో స్థిరపడాలనీ నాకు లేదని చాలాసార్లు చెప్పాను మీకు.''

''నీకు అలాంటి అభిప్రాయం లేకపోవచ్చు కానీ, నిన్నొక మహానటిగా తీర్చిదిద్దాలని నాకు వుంది మరి ! అందుకే నీకు తెలియకుండానే మరో రెండు పిక్చర్‌లు ఒప్పుకున్నాను. ఇవికూడా

అయిపోయాక వెళ్ళిపోవాలని అనిపిస్తే వెళ్ళిపో అప్పుడు నేను అభ్యంతరపెట్టను. మరొకమాట ఇకముందు.చపలచిత్తురాలివైన నిన్ను నమ్ముకొని ఏ పిక్చర్ కూడా ఒప్పుకోను. మొత్తానికి నాకు బుద్ధివచ్చేట్లే చేస్తున్నావ్.'' లేని కోపం ప్రదర్శించి చటుక్కున లేచిపోయాడు భీమసేన రావు అక్కణ్ణుంచీ

అమృత చంద్రవంక పేరుతో ఒక నటిగా గుర్తింపులోకి వచ్చింది. ధన వ్యామోహం ఆమెలో ఏ కోశానాలేదు. అటువంటి అమృతను అడ్డు పెట్టుకొని తను నాలుగు డబ్బులు సంపాదించు కోవాలన్న ఆలోచన కలిగింది ఆమెను సాధ్యమై నంతవరకు ఎక్కువ సినిమాల్లో బుక్ చేయించి తను లబ్ది పొందాలనే అమృతకు తెలియకుండానే మరి రెండు పిక్చర్‌లు ఒప్పుకున్నాడు భీమసేన రావు సందర్భం కలిసివచ్చింది కదా అని ఇప్పుడు ఆ విషయాన్ని బయట పెట్టేశాడు

భీమసేనరావు మాటలు విన్న అమృత ఆలోచనలోపడింది . నిజమే. తను సినీనటిగా గుర్తింపులోకి వచ్చింది. కనుక బయటి ప్రపంచం లోకి వెళ్తే కొంత ఇబ్బంది ఎదుర్కోవలసి వస్తుంది. ఇది వేరే విషయం. మరి భీమసేన రావు తనకు తెలియకుండానే మరో రెండు పిక్చర్ల్ని ఒప్పుకోవటమేమిటి ? ఎందుకు తనని ఎటూ కదలకుండా చేస్తున్నాడు ఆయన ?

మనసుకు ఏమిటో అశాంతి అనిపించి వెళ్ళి దైవమందిరం ముందు కూర్చొంది. భీమసేన రావు కారులో ఎటో వెళ్ళిపోయాడు.

రాత్రి ఎనిమిది గంటలకు ''అమ్మా, వంట పూర్తైంది. భోంచేద్దురుగాని రండి.'' అని పిలిచింది మంగతాయారు వచ్చి.

అయిష్టంగానే లేచి వెళ్లింది అమృత

ఆమె భోజనం చేస్తున్నప్పుడే ఎవరో తలుపుల మీద దబ దబ బాదుతున్న శబ్దం వినిపించి, ''తాయారూ, ఎవరో వచ్చినట్లు న్నారు వెళ్లిచూడు '' అంది అమృత. తాయారు వెళ్లి తలుపులు తీయటంతో మెరుపులా లోపలికి దూసుకువచ్చింది హైమవతి !

''ఎవరు మీరు, ఏం కావాలి ? '' అని తాయారు అడుగుతున్నా వినిపించుకోకుండా, ''అమృత కావాలి. ఆమె ఎక్కడ ? '' అంటూ సరాసరి లోపలికి వచ్చేసింది

డైనింగ్ హాల్‌లో భోంచేస్తున్న అమృత, తన దగ్గిరికే వడివడిగా వస్తున్న హైమను చూసి ఎంతో ఆశ్చర్యపడింది సేవాసదనంలో తను ఆమెతో కలిసివున్నది కొద్దిరోజులే అయినా హైమను మర్చిపోలేదు అమృత

తీరా అమృత దగ్గిరికి వచ్చేసరికి ఎవరో బలవంతాన ఆపినట్లు టక్కున ఆగిపోయింది హైమ

''బాగున్నావా హైమా ? రా వచ్చి కూర్చో'' అంది అమృత చొరవ తీసుకొని

''నేనింకా నీకు గుర్తే ఉన్నానన్నమాట ! ఒకవేళ నన్ను మరిచిపోయావేమో అనే సందేహిస్తున్నాను అయితే పర్వాలేదు '' అంటూ లేని ఉత్సాహాన్ని అనునయిస్తూ వచ్చి అమృత ఎక్కనే మరో కుర్చీలో కూర్చొంది హైమ

''మాటలు తర్వాతగాని ముందు భోంచెయ్ తాయారూ ! ఈమెకు కూడా వడ్డించు'' అంది అమృత

''నిన్ను చూసి, నీ మాటలు విన్నాక, సంతోషంతో కడుపు నిండిపోయింది అమృతా ఇక ఇప్పుడు భోంచేయాలనిపించటంలేదు ''

''పర్వాలేదులే. సహించినంత తిను ''

తాయారు వడ్డించింది

''అమృతా ! నువ్వు అప్పటికి ఇప్పటికి ఎంతో మారిపోయావ్ ?'' ఒకపక్క మెతుకులు నంజుతూ, మరోచెంప అమృతను నఖశిఖపర్యంతం పరిశీలించి చూస్తూ అంది హైమ.

''భౌతికపరంగా నాలో మార్పు వచ్చి వుండవచ్చు.''

''బిజీ స్టార్‌వైపోయాక కూడా నీ వేదాంత ధోరణిలో మార్పు రాలేదన్నమాట.''

''పోనీలే నా విషయం వదిలేయ్, హైమా! మరి నీ మాటేమిటో చెప్పు. ఇప్పుడు నువ్వు ఆ జైలు నుంచి ఎలా తప్పించుకొచ్చావ్ ? నా

అడ్రసు నీకు ఎట్లా తెలిసింది ? ''

''నువ్వు ఆ రాత్రి డైరెక్టర్ భీమసేనరావు దగ్గిరికి రావటం, నిన్ను ఆయన ఆ నరకం నుంచీ తప్పించి సినిమా ఛాన్సు ఇవ్వటం అంతా నాకు తెలుసు అప్పట్నుంచీ నిన్ను ఎలా కలుసుకుందామా అని ఒకటే ఆరాటం ! ఆ ఆరాటంతోనే అక్కణ్ణుంచీ తప్పించుకురావటానికి రెండుసార్లు ప్రయత్నించి కొరడా దెబ్బలు తిన్నాను లలితాబాయి చేత ముచ్చటగా మూడవసారి ఏంజరుగుతుందో అదే జరుగుతుందని తెగించి వచ్చేశాను. అదృష్టం బాగుండి నేను ఎవరి కంటాపడలేదు ఈవేళ నువ్వువుండేది భీమసేనరావుగారి గెస్ట్‌హౌసని తెలిసింది ఆ ప్రకారమే తేలిగ్గానే రాగలిగాను ఇక్కడికి.''

భోజనం పూర్తైనతర్వాత హైమతోపాటు తన గదిలోకి వచ్చింది అమృత

''అమృతా! నా దీనగాధ నీకు తెలుసు. నాకు చిన్నతనం నుంచీ సినిమాలంటే వెర్రి వ్యామోహం ! నేనూ ఒక సినీ నటిని కావాలని ఎన్ని కలలు గన్నానో ? ఆ ఊహాప్రపంచంలోపడి నేను చాలా దూరం కొట్టుకువచ్చాను. నాకు తెలుసు పరువుగల కుటుంబంలో పుట్టి, అంతో ఇంతో చదువుకొని తప్పటడుగు వేసి ఇంట్లోంచీ లేచి వచ్చేశాను నేను దాంతో నా బ్రతుకు అస్తవ్యస్తమైపోయింది. రోజుకొకడి కామ వాంఛలను తీరుస్తూ కుక్కలా ఆ సేవాసదనంలో పడి ఛుంటూ లలితాబాయికి డబ్బు చేసిపెట్టటం జరుగుతోంది '' తన బ్రతుకును తలుచుకొని వెక్కివెక్కి ఏడ్చింది హైమ

ఆ స్థితిలో ఆమెను చూడలేకపోయింది అమృత. ''జరిగిందేదో జరిగిపోయింది జరగవలసింది చూడు హైమా'' అంది ఓదార్పుగా.

''జరగవలసింది నీ చే తి లో నే వుంది అమృతా''అంది హైమ కళ్ళు తుడుచుకుంటూ.

''నీకు నావల్ల ఏంమేలు జరుగుతుందో చెప్పు. తప్పక చేసిపెడతాను.''

''అ యి తే భీమసేనరావుగారికి చె ప్పి నాకేదైనా సినిమా ఛాన్సు ఇప్పించు. ఎంత చిన్నపాత్ర అయినాసరే చేస్తాను. ఒక్కసినిమాలో కనిపించగలిగినా నా జీవితం ధన్యమైనట్లే భావించుకుంటాను ఆ తర్వాత చనిపోయినా నాకు ఆనందమే ''

''హైమా ! భగవంతుడు అన్నీ చిత్రంగానే జరిపిస్తూంటాడు సినిమాలలో నటించాలని కలలోకూడా తలవని నాకు అ ను కో కుం డా అవకాశం వచ్చింది. అదే సినీనటి కావాలని బ్రతుకునే ఫణంగా ఒడ్డిన నీవు ఆగాధంలోకి వెళ్ళిపోయావు. నిజంగా ఇది ఘోరన్యాయం ఇకమాత్రం అలాకాదు కానీయను. నీ కలలు ఫలించేలా చేస్తాను హైమా ! భీమసేనరావుగారికి శతవిధాలా నచ్చచెప్పి నీకూ ఏదో ఒక సినిమా ఛాన్సు వచ్చేలా చూస్తాను నేనిప్పుడు ఆయన అన్న కూతురు చంద్రవంకగా చలామణి ఔతున్నాను అలాగే నువ్వు నా చె ల్లె లు శ్రీకుమారివి ''

'' అక్కా ! '' హైమ అమాంతంగా అమృత కాళ్ళమీద పడింది. ''నువ్వు నిజంగానే నా అక్కయ్యవు అమృతా ! నేను మద్రాసు వచ్చి ఇంతకాలమైంది, ఇలా ఒక్కరూ నా ముందు ఆశావహంగా మాట్లాడి ఎరుగరు ఇప్పుడు నాకు ఎంతో ఆనందంగా ఉంది కృతజ్ఞతలు ఎలా తెలియజెప్పాలో అర్థం కావటంలేదు'' అంది.

''లే హైమా. నీకు అందివచ్చిన అవకాశాన్ని వినియోగించుకో. కష్టపడి నీలోని మహానటిని వెలికి తియ్యి. తారాపధానికి చేరుకో. అదే నీవు నాకు తెలియచెప్పగల కృతజ్ఞత'' అంది అమృత హైమను లేవదీసి తన ప్రక్కన కూర్చోబెట్టుకొని

తర్వాత గుర్తువచ్చి, ''ల లి తా బా యి మనుషులు ఇక్కడికి వస్తారేమో అమృతా ! '' అంది హైమ

''రారులే. ఈ రాత్రికి గడిస్తే రేపు ఉదయమే భీమసేనరావుగారు వస్తారు ఆయనతో నీ సి ని మా ఛాన్సుతోపాటు లలితాబాయితో మాట్లాడే విషయం కూడా చెబుతాను. ఇందును గురించి నువ్వేం దిగులుపడకు మరి నీతోపాటు ఉండే సరళ ఎలా వుంది ?'' అడిగింది అమృత

''అలాగే జీవశ్ఛవంలా అక్కడే బ్రతుకుతోంది '' చెప్పింది హైమ

మర్నాడు ఉదయం వచ్చిన భీమసేనరావుకు హైమను పరిచయం చేసి పరిస్థితులను వివరించింది అమృత తర్వాత,

''బాబాయిగారూ ! నాకు తెలియకుండా మీరు రెండు పిక్చర్లు ఒప్పుకున్నానని చెప్పారు. మీ మాట ప్రకారం వాటిల్లో నటిస్తాను. మీరు మాత్రం నా మాట ప్రకారం హైమ జీవితాన్ని ఒక ఒడ్డుకు చేర్చాలి లలితాబాయికి మీరు ఏమైనా—ఎలాగైనా నచ్చచెప్పండి. కానీ ఆమెగాని, ఆమె మనుషులుగాని ఇక్కడికి రాకూడదు ఇంకోమాట నేను నటించే పిక్చర్లలో హైమకు కూడా ఏదో ఒక పాత్ర ఇవ్వాలి, ఆమెను మీ అన్నగారి రెండవ కూతురిగా, నా చెల్లెలు శ్రీకుమారిగా లోకానికి పరిచయం చేయండి మీరు కాదంటే హైమతో కలిసి నేనూ ఎటైనా వెళ్ళిపోతాను.'' అంటూ అవకాశాన్ని వినియోగించుకొనే రీతిలో మాట్లాడింది

ఆమె మాటలకు అవసరం తనది కనుక ఒప్పుకోక తప్పలేదు భీమసేనరావు. అమృత మాట ప్రకారం హైమకు సినిమా ఛాన్సు ఇవ్వటం, ఆమెకు సంబంధించి లలితాబాయి బెడద లేకుండా చేయటం, తన గెస్ట్‌హౌస్‌లోనే వుండేందుకు అంగీకరించటం అన్నింటికీ తల ఒగ్గాడు ముందే మరోమాట కూడా చెప్పింది అమృత, సినీనటిగా హైమకు లభించే పారితోషికాలు ఆమెకే చెందాలని. అందుకు సరే అన్నాడు భీమసేనరావు

హైమకు నిజంగా పండుగలా వుంది ఆ రోజు ఓ తపస్వికి తను తోడ్పడగలగటం — అది తన మహద్భాగ్యంగా భావించుకొంది అమృత.

**(ఇంకా వుంది)**

---

శ్రీ శృంగేరీ శారదా పీఠం వారు విజయవాడ రైల్వే స్టేషన్‌లోని 5వ నెంబరు ప్లాట్‌ఫారం మీద ఏర్పాటు చేసిన స్టాల్‌కి అక్టోబరు 23న విజయవాడ డివిజన్ రైల్వే మానేజరు శ్రీ ఎం కె రావు ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం ఈ స్టాల్‌లో పీఠం ప్రచురణలతో పాటు వేదాంత గ్రంధాలు రుద్రాక్ష, స్ఫటికమాలలు కంచు పాత్రలు, ఫోటోలు శ్రీ చక్రాలు, దీపపు సెమ్మెలు మొదలైన పూజాసాధనాలు లభిస్తాయి



# మీ సెక్స్ సందేహాలకి సమాధానాలు




**ఓ బికారి, సన్యాసిపురం**

నా వయసు 94 ఆరుగురు పిల్లలూ, ఇరవైమంది మనవరాళ్ళూ, మనవలూ, ముగ్గురు మునిమనవలూ, మనవరాళ్ళూ ఉన్నారు నాకు మళ్లీ వివాహం చేసుకోవాలని ఉంది ముందు మంచి మందు ఏదయినా పుచ్చుకుంటే మంచిదనుకుంటున్నాను ఏమి పుచ్చుకోమంటారు?

● పొటాషియమ్ సయినడ్ లేకపోతే ఎండ్రిన్

**ఈ. బుచ్చమ్మ, అబద్ధాలగుట్ట**

నేను బాల వితంతువుని నన్నొకానొక వ్యక్తిగారు పెళ్లి చేసుకుంటానని మాట యిచ్చారు నా బరువు 165 పౌనులు ఆ వ్యక్తిగారి బరువు 94 పౌనులు మీ సలహా ఏమిటి?

● ఆయనకి రక్తదానం చెయ్యండి

**కా. కీ. శాస్త్రి**

నాకు షర్టూ, పాంటూ వేసుకోవటం అలవాటు ఈ మధ్య నా సతీమణి నన్ను కాషాయ వస్త్రాలు ధరించమని పట్టుపడుతోంది సన్యాసికి సంసారం ఏమిటని నేను వాదిస్తే వినటం లేదు ఒక వేళ వాటిని వేసుకోవలసి వస్తే నేను ఏమి నియమాలు పాటించాలి?




● సంసారం చేసే సమయాల్లో అవి తీసేయండి చాలు

**ఎం ప్రజావాది, జనసాగరం**

నేనో పార్టీ బహిరంగ సభకు వెళ్లాను త్రొక్కిసలాటలో క్రింద పడ్డాను డాక్టర్లు నన్ను పరీక్షించి పెళ్లి చేసుకోకూడదన్నారు ఇక నేనేం చెయ్యాలి

● రాజకీయాల్లో చేరండి

**కె చంటబ్బాయి, దొంగపూడి**

పదేళ్ల నుంచి వాడుతున్న సైకిల్‌ని ఎవరో కొట్టేసారు ఇంకోటి కొనే స్తోమత లేదు నిద్రలో సైకిల్ తొక్కుతున్నట్టు కాళ్లు వూపుతున్నానట ఈ జబ్బు ఎలా తగ్గుతుంది

● రోజూ రెండు గంటలు రాత్రిళ్ళు రిక్షా తొక్కండి డబ్బు వస్తుంది జబ్బు తగ్గుతుంది

**ఆ. పాపారావు, మయనగరం**

నాకు 61 సంవత్సరాలు ఇంకా పెళ్లి కాలేదు ఈ మధ్యనే ఒక స్నేహితుడు నాకు వాత్సాయనుడి కామసూత్రాలు కానుకగా ఇచ్చాడు అది సంస్కృత భాషలో వుంది గానీ, ఉర్దూ లిపిలో వేశారు ఎందుకు నాకు ఈ పుస్తకం, అని అడిగితే, వివాహం చేసుకుంటావు కదా అని ఇచ్చాను, అంటాడు నా స్నేహితుడు వచ్చిన చిక్కేమిటంటే నాకు సంస్కృతం రాదు, ఉర్దూ లిపి చదవలేను ఏమి చెయ్యమన్నారు?

● పెళ్లి వాయిదా వేసి భాషాధ్యయనం చెయ్యండి

**ఎ వి. రావు, లేదులూరు**

నాకు 25 సంవత్సరాలు ఈ మధ్యనే పెళ్లయింది నా సతీమణి నన్ను ఒక ప్రశ్న వేసేటప్పటికి నాకేమి చెప్పాలో తెలీక మిమ్మల్ని అడుగుతున్నాను "నిరోధ కంపెనీ అమ్మకాలు ఎంత? లాభాలు ఏ మాత్రం? అంటోంది ఏమని చెప్పను?

● బజార్లో పువ్వుల అమ్మకాలు ఎంత ఉంటే అంత కొన్నవాడిదే లాభం, అని చెప్పండి

**నిదురావతి, పథకాపురం**

మా వారికి నిద్రలో లేచి నడిచే అలవాటుంది రోడ్డు మీద దేనిక్రిందయినా పడి ఛస్తారేమోనని భయంగావుంది ఏం చెయ్యమంటారు

● నెత్తికి డేంజర్ లైట్ బిగించండి

**మా. మా. రావు, ఉత్తపూడి**

నాకు కుక్కలంటే చచ్చేంత భయం మా కాబోయే మామగారి ఇంట్లో ఒక పెద్ద (మొరిగే, కరిచే) కుక్క వుంది దానిని కూడా పెళ్లి కానుకగా ఇస్తామంటున్నాడాయన ఏమి చెయ్యను?

● కుక్కకి కూడా కట్నం అడిగండి వుంచేసుకుంటాడు

**ఎస్. ఐ. ఎమ్., పరదేశి**

అదేదో పత్రికలో ప్రకటన చూసి మంచిదనుకుని కామార్ణవం అనే ఒక మందు తెప్పించాను అది వేసుకున్నప్పుడల్లా నిద్ర తెగ ముంచుకు వస్తుంది మీ సలహా ఏమిటి?




● ఎక్కువ నీళ్ళు కలిపి తాగితే ఫలితం కనిపించవచ్చు పైగా మందు ఎక్కువ రోజులు వస్తుంది కూడా!

## ఇ షాక్‌వాలీ, విద్యుత్‌పురం

ఈ మధ్య జీవితంలో మొదటిసారిగ ఒ అమ్మాయి చెయ్యి తాకాను వెంటనే షాక్ కొట్టి పడిపోయాను అప్పట్నించి ఆడదాన్ని ముట్టుకోవాలంటే భయంగా వుంది ఇలాంటి పరిస్థితుల్లో నాకు పెళ్లి ఎట్లా అవుతుంది?




● అమ్మాయిల్ని తాకేటప్పుడు, కాళ్లకి రబ్బరు-బూట్లు వేసుకోండి

## కె. డి. నిశాచారి, నీరసంగేటు

నేనో అమ్మాయిని పెళ్లి చేసుకోబోతున్నాను ఆమె టీచర్- పగలు డ్యూటీ, నాది నైట్ వాచ్‌మన్ ఉద్యోగం మాకు సంసారం ఎలా కుదురుతుంది?

● సంసారం ఆఫీసులో పెట్టండి

## పి. కనులకుమారి, దరిద్రాపురం

నేనొక అబ్బాయిని రోజూ చూస్తున్నాను అతను నన్నూ రోజూ చూస్తున్నాడు నాకేమో భయంగా వుంది

● చూపులు కలిస్తే ఫర్వాలేదు శరీరాలు కలిస్తే డాక్టర్ దగ్గరికెళ్లాలి

## ఆర్. అనుమాన్, చింతలూరు

నా మీద నాకు సందేహం కలిగి, ఇద్దరు ముగ్గురు డాక్టర్ల దగ్గరకెళ్లాను నేను పెళ్ళికి పనికి రానని చెప్పారు ఇక అంతేనంటారా?

● మీరు వెళ్లాల్సింది డాక్టర్ల దగ్గరికి కాదు □

# జీతం జీవితం




పోట్లూరు సుబ్రహ్మణ్యం

రాజారావు భార్య వంటింట్లోంచి మెల్ల మెల్లగా సుప్రభాతం వినిపిస్తోంది సణుగుడు రూపంలో ఇద్దరు పిల్లలు ఇడ్లీలు గబగబా నోట్లో కుక్కుకొని స్కూలుకు బయలు దేరారు ఒకడు అయిదవ క్లాసు, రెండవ వాడు మూడో క్లాసు చదువుతున్నారు రాజారావు అరువు తెచ్చుకొని చదివిన పేపరు మడచి స్కూలుకు పోయే పెద్ద పిల్లవాడిచేత పక్కింటికి పంపించాడు వాడు పేపరు పక్కింట్లో ఇచ్చి వచ్చి తండ్రి కెదురుగా నిలబడ్డాడు తమ్ముడితో సహా

నాన్నా! స్కూలుకు పోతున్నాం" అన్నాడు

వాళ్ళు స్కూలుకు వెళ్ళేప్పుడు పాకెట్ మనీ క్రింద చెరొక అర్ధ రూపాయ ఇవ్వడం రాజారావుకు అలవాటు అందుకే ఆగారు నెలలో ఆఖరు రోజులు కావడంచేత రాజారావు చేతిలో డబ్బులు మెలగడంలేదు

బాబూ రెండు రోజుల్లో జీతం వస్తుంది తరువాత ఇస్తానుగా ఈ రోజుకు స్కూలుకు వెళ్ళండి అనునయంగా అన్నాడు

వాళ్ళు వినలేదు కొద్ది సేపు ఏడ్చారు రాజారావు వాళ్ళను బ్రతిమాలి స్కూలుకు పంపించేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది

అంతలో వంటింట్లోంచి అతని భార్య వచ్చింది "ఏమండీ మార్కెట్టుకు వెళ్ళి కూరగాయలు తెండి కిరాణా సరకులు కూడా అయిపోయాయి చెప్పడం ఇష్టం లేనట్లు, చెప్పక తప్పదన్నట్లు చెప్పింది

రాజారావు రెండో విషయం విననట్లు మౌనంగా చేతి సంచీ అందుకొని బయలుదేరాడు, ఇక ఎక్కువ సేపు ఉంటే ఎన్ని సమస్యలు వచ్చి పడుతాయోనని

రాజారావు జీవితాన్ని పరిశీలిస్తే చాల విచిత్రంగా ఉంటుంది అతని నెల జీవితాన్ని నాలుగు భాగాలుగా విభజించి చూస్తే ఒక్కో వారం ఒక్కో పాత్రలో మనకు కనిపిస్తాడు అతని దృష్టిలో మొదటి వారం గోల్డన్ వీక్, రెండవ వారం సిల్వర్ వీక్, మూడవ వారం కాపర్ వీక్, నాలుగవ వారం ఐరన్ వీక్

## గోల్డన్ వీక్

ఈ వారంలో రాజారావు డైనమిక్ హీరో పాత్ర ధరిస్తాడు ఇది నెలలో మొదటి వారం జీతం తీసుకొన్న రోజునుంచి మొదలవుతుంది ఈ వారంలో రాజారావు బంగారు బాబులా తన జీవితాన్ని గంట నొక నిముషంగా గడిపేస్తాడు మొదటి తేదీ జీతం తీసుకోగానే ఒక కె జి స్వీట్సు కొంటాడు తరువాత పది రూపాయలకు పండ్లు, ఒక రూపాయకు పూలు కొంటాడు సైకిలు ఆఫీసులో పడేసి జల్సాగా ఆటోలో ఇంటికి వస్తాడు

డియర్ విమలా నువ్వు నా దేవతవు" అంటూ భార్య తలలో పూలు తురుముతాడు

"ఒకేసారి ఇన్ని స్వీట్సు దేనికండీ నెలాఖరు వరకూ ఇబ్బంది లేకుండా గడపాలికదా"

"విమలా మనమేమీ లక్షాధికారులం కాదు రోజూ జాలీగా ఉండడానికి ఉన్నప్పుడే అనుభవించాలి

"పిల్లలు ట్యూషనునుంచి ఇంకా రాలేదండీ"

నే వెళ్ళి తీసుకొస్తానుండు అంటూ వాళ్ళ కోసం బయలుదేరుతాడు ఆ రోజంతా పిల్లల్ని ముద్దు మురిపాలతో ముంచేస్తాడు వాళ్ళచేత దగ్గరుండి స్వీట్సు తినిపిస్తాడు

వాళ్ళు ఆ రాత్రి గారాలు పోతూ తమ కోర్కెలన్నీ బయట పెడుతారు అన్నిటికీ ఆనందంగా అంగీకరిస్తాడు వాళ్ళకు రోజూ ఇచ్చే పాకెట్ మనీ కంటే ఎక్కువ ఇస్తాడు

ఆ రాత్రి భార్యను అనంద తరంగాల్లో ముంచి వేస్తూ "విమలా రేపు సినిమాకు టికెట్లు రిజర్వు చేయించాను ఒక గంట పర్మిషను పెట్టి వస్తాను అందరం సినిమాకు వెల్దాం హోటల్లోనే భోజనం అంటాడు

భర్త ఇంత ఆనందంగా కోరుతుంటే ఎందుకు కాదనడం అనుకొంటుంది విమల ఒకవేళ కాదన్నా భర్త తన మాట వినడని విమలకు తెలుసు అటువంటప్పుడు అతనికనుకూలంగా అతన్ని ఉత్సాహ పరచడమే మేలనుకొంటుంది

మరుసటి రోజు ఉదయాన్నే కిరాణా కొట్టు దగ్గర కిరాణా సరుకలు తెచ్చి పడేస్తాడు ఇంటి బాడుగ, మిగతా ఖాతా పద్దులన్నీ చెల్లిస్తాడు అంతా పోను రెండు, మూడు వందలకంటే ఎక్కువ మిగలదు సామాన్యంగా "ఆ సాయంత్రం ఆఫీసుకు పర్మిషను పడేసి ఆనందంగా ఇంటికి వస్తాడు

"విమలా ఇంకా రెడీ కాలేదా ఆటో కూడా తీసుకొచ్చాను" అంటాడు

"ఆటో దేనికండీ డబ్బు దండుగ రిక్షాలో వెల్దాం" అంటుంది విమల బాధగా.

"రిక్షాలో కూర్చుంటే నడుములు విరిగి పోతాయి ఇక మాట్లాడకు"

ఆ సాయంత్రం అందరూ సినిమా చూసి, హోటల్లో భోంచేసి మళ్ళీ ఆటోలో ఇంటి కొస్తారు ఆ రాత్రి అంతా కలిపి ఖర్చు యాభై

ఆఫీసులో కూడా ఇంతే తన కొలీగ్సుని కాఫీకి, టీకి ఆహ్వానిస్తూ ఉల్లాసంగా కనిపిస్తాడు

"హల్లో సుమతీ అలా కాఫీకి వస్తావా" అంటూ టైపిస్టును ప్రత్యేకంగా పిలుస్తాడు ఇంగ్లీషు అంటే పడి చచ్చే ఆమెకు తను చూసిన ఇంగ్లీషు సినిమాల గురించి గంటలు గంటలు" ఉపన్యసిస్తాడు ఆ సమయంలో సెక్షన్ హెడ్ చీవాట్లు కూడా ఇతని వజ్ర శరీరాన్ని ఛేదించలేవు

ఇక ఇంటి దగ్గర బంధువులు వస్తే సరేసరి వాళ్ళను విందు వినోదాలతో అనంద పరుస్తాడు వేయేల అతని జీవితం వినీలాకాశంలో ముందుకు చొచ్చుకు పోయే బోయింగ్ విమానంలా ఉంటుంది

## సిల్వర్ వీక్

క్రమేణా రాజారావు రెండవ వారంలో ప్రవేశిస్తాడు దీన్ని అతను సిల్వర్ వీక్గా భావిస్తాడు ఈ వెండి వారంలో డబ్బుకు పెద్దగా లోటుండదు జల్సా చేయడు కాని ఈ వారం ఇబ్బంది లేకుండా గడిపేస్తాడు మొదటి వారంలో నాలుగు మూరలు పూలు కొనే రాజారావు, ఈ వారంలో ఒక మూర పూలు మాత్రమే కొంటాడు

సాయంత్రం ఆరు గంటలకు వస్తాడు రాగానే విశ్రాంతిగా ఈజీచెయిర్లో వాలుతాడు

"మీరు ఈమధ్య పిల్లలకు స్వీట్సు తేవడం లేదు రేపు నేనయినా చేస్తాను" అంటుంది భార్య

"స్వీట్సు దేనికి బిస్కెట్లు తెచ్చాను గాని వాటిని తినమను" అంటూ కూర్చొంటాడు

"పిల్లలు ట్యూషనుకు వెళ్ళి చాలసేపయింది ఏమిటో ఇంకా రాలేదు"

"ప్రతి దానికి కంగారు పడకు వాళ్ళిక్కడికి పోరు వస్తారులే" భార్యమీద విసుక్కొంటాడు

ఆ వారమంతా రోజులు అలా గడుస్తుంటాయి

"విమలా రేపు సినిమాకి వెల్దామా"

"టికెట్లు రిజర్వు చేయించారా"

"టికెట్లు రిజర్వు చేయించడం దేనికి నే చెప్పే సినిమా రిలీజయి చాల రోజులయింది కరెంటు బుకింగు దొరుకుతుంది

ఒకప్పుడు రిక్షాలో ఒళ్ళు హూనమవుతుంది అన్నవాడే రెండు రిక్షాలు మాట్లాడుతాడు ఒక రిక్షాలో తనూ పెద్దవాడు కూర్చుంటారు రెండవదాంట్లో భార్య, చిన్న పిల్లవాడు కూర్చుంటారు

ఆ రాత్రి సినిమా చూసి భోజనానికి ఇంటికే వస్తారు

అంతకుముందు భార్య చేత బట్ట లుతికించనివాడు, ఈ వారంలో ఇంటి దగ్గర భార్య లంగాలూ, బనీన్లు, డ్రాలు బావి దగ్గర ఉతుకుతుంటే కాదనడు మౌనంగా చూస్తుంటాడు ఆఫీసులో స్నేహితులు పిలిస్తేనే హోటలుకు వెడతాడు అదీ వాళ్ళు బిల్లు చెల్లించేట్లుగా ఉంటేనే

ఏమండీ ఈమధ్యన మీరు నన్ను కాఫీకి పిలువడం లేదు కారణం" గారాలు పోతూ అడుగుతుంది టైపిస్టు సుమతి

సారీ సుమతీ లెటజ్గో" అంటాడు

ఇద్దరు కాంటిన్లో కూర్చుంటే ఇతనికంటే ఎక్కువ సుమతే మాట్లాడుతుంది బిల్లు రాజారావే పే చేస్తాడు

ఇద్దరూ మౌనంగా తిరిగి వస్తారు

ఆఫీసులో హెడ్ క్లర్కు ఏమయినా అంటే తలవంచుకొంటాడు ఎదురు మాట్లాడడు

ఎప్పుడు వచ్చారు అంటూ ముక్తసరిగా పలుకరిస్తాడు వచ్చిన బంధువుల్ని

వాళ్ళేవయినా మాట్లాడితే ఊ ఆ " అంటూ ముభావంగా జవాబు చెపుతాడు

ఎక్కువ మాట్లాడితే ఎక్కడ శాశ్వత నివాసం ఏర్పరచుకొంటారోనని అతని భయం

అతని జీవితంలో మొదటి వారం ఆకాశంలో పయనించే బోయింగ్ విమానముయితే, ఈ వారంలో అతని జీవితం నున్నని సిమెంటు రోడ్డు మీద వంద మైళ్ళ వేగంతో పరుగెత్తే కొత్త ఇంపాలా కారు లాగుంటుంది

## కాపర్వీక్

రాజారావు జీవితం మూడవ వారంలో ప్రవేశించగానే అతని జీవిత విదానమే మారిపోతుంది ప్రస్తుతం ప్యూపా దశలో ఉంటాడు ఇప్పుడు అతని జీవితం గతుకుల రోడ్డు మీద నడచే రిక్షా లాగుంటుంది ప్రతి క్షణమూ నలు వైపులనుంచీ ఒడిదుడుకులు తగులుతూ ఉంటాయి అయినా తన పరిధిలోనే తను ముడుచుకు కూర్చుంటాడు వీలున్నంత వరకు మౌనాన్ని పాటిస్తాడు కదిలిస్తే విసుక్కుంటాడు

ఏమండీ మీరు తెచ్చిన సామాన్లు నిండు కొస్తున్నాయి ఇక రెండు మూడు రోజుల కంటే ఎక్కువ రావు బార్య పరిస్థితి తెలియ జేస్తుంది

ఇది కూడా నాకు చెప్పాల్నా పొదుపు అనేది మనిషికి ముఖ్యం జాగ్రత్తగా ఆ మూడు రోజుల సరకుల్ని నెలాఖరు వరకు సర్దాలి దాన్నే గృహస్థ దర్మ మంటారు

ఏం చేయమంటారండి రెండు మూడు రోజుల్లో వస్తున్నట్లు మా అమ్మ ఉత్తరం కూడా వ్రాసింది

"ఖర్మ వస్తానని రాసిందీ దీర్ఘం తీస్తాడు, అత్తగారి ముందు తన లేమి తనం ఎక్కడ బయట పడుతుందోనని బయపడుతూ ఎక్కడయినా అప్పు తెచ్చి ఈ వారం జాగ్రత్తగా లాగెయ్యాలని నిర్ణయించుకొంటాడు

ఈవారంలో రాజారావు అప్పుల వేట ప్రారంభమవుతుంది ఒక వైపు అహం అడ్డు వస్తే, ఇంకో వైపు అవసరం ఎదురు చూస్తుంటుంది ఈ రెండు పరిస్థితుల మధ్య రాజారావు గిజగిజలాడి పోతాడు

బావి దగ్గర బట్టలు ఉతికే భార్యతో మనమిక లాండ్రీలను మరచిపోవాలి అన్ని బట్టలూ ఇంటి దగ్గరే ఉతుకు అంటాడు

ఆమెకు ఆ రోజు నుంచి భర్త బట్టలు, తన చీరెలు, పిల్లల చొక్కాలు ఉతకడంతోనే పొద్దస -

మానం గడచి పోతుంది

పిల్లలు ఏది చేసినా చీటికి మాటికి ఉగ్రుడై పోతాడు "గాడిదల్లారా ఏమిట్రా మీ అల్లరి గలబా చేసారంటే వీపు పేలిపోతుంది అంటాడు

ఎప్పుడయినా పిల్లల బలవంతం మీదనో బార్య కోరిక మీదనో సినిమాకు వెళ్ళాల్సి వస్తుంది అందరికీ ఒకే రిక్షా మాట్లాడుతాడు

"ఒక్క రిక్షాలో నలుగురం ఎలా పోగలమండీ

"ఎలాగో సర్దుకు పోవాలి ప్రతిదీ మనకు సౌకర్యంగా ఉండాలంటే ఎలా అంటాడు భార్య మాటలకు విసుక్కుంటూ

నలుగురూ ఒకే రిక్షాలొ కూర్చుంటారు రాజారావు పెద్ద వాడ్ని ఒళ్ళో కూర్చో బెట్టుకొంటే చిన్నవాడు తల్లి ఒళ్ళో కూర్చుంటాడు వచ్చేప్పుడు కూడా అందరూ ఒకే రిక్షాలో వస్తారు

ఆఫీసులో కూడా ఆ వారంలో లేనిపోని గాంబీర్యం తెచ్చుకొని గడుపుతాడు

"ఏమండీ సుమతిగారూ ఈ రోజు మీరు టీ ఇప్పించండి మీ చేతి టీ త్రాగాలని ఎందుకో బుద్ధి పుట్టింది" అంటాడు లేని చిరునవ్వు తెచ్చిపెట్టుకొని

"ఓ ఎస్ అలాగే ఈ వారమంతా నేనే టీ ఇప్పిస్తాను రండి" అంటుంది టైపిస్టు సుమతి అతని మాటలకు పొంగిపోయి

ఈ వారంలో సెక్షన్ హెడ్ ఏదయినా మాట్లాడితే ఎదరు తిరిగి మాట్లాడుతాడు ఎక్కువగా సాయంత్రాలు పార్కులో గడిపేస్తుంటాడు ఇంటికిపోతే అది లేదు, ఇది లేదు అనే భార్య కామెంట్ల కంటే ఇక్కడ ప్రశాంతంగా ఉంటుందను కొంటాడు

## ఐరన్ వీక్

ఈ వారం అతనికి చీకటి రాత్రిలా కనిపిస్తుంది అతనికి ప్రతి రోజూ తను గోల్డన్ వీక్‌లో గడిపిన స్వర్ణ యుగం గుర్తు కొస్తుంటుంది నెలకు ముప్పై రోజులు సరాసరి కనుక ఐరన్ వీక్‌లో ఇంకో రెండు రోజులు వచ్చి చేరుతాయి. మూలిగే నక్క మీద తాటి పండు పడ్డట్లు ఈ వారాన్ని ఇంకో విధంగా లాంగెస్ట్ వీక్ అని కూడా వర్ణించవచ్చు

ఈ వారంలో రాజారావు యుద్ధంలో ప్రాణంమీద చివరి ఆశతో పోరాడే సైనికుడిలా గడుపుతాడు చెడిపోయిన కారుని వెనుకనుంచి నెట్టినట్లు రోజులు ఇతన్ని నెట్టుకు పోతాయి గడ్డం పెంచుతాడు ముఖంలో ట్రాజెడీ ఫీలింగ్సు పెడతాడు రాబోయే జీతం గుర్తు తెచ్చుకొని ఒకింత తృప్తి పడుతూ గడుపుతాడు

అవసరానికి అప్పిచ్చే నాధుడు ఒక్కడూ కనిపించడు అడిగి అందరిచేతా లేదనిపించుకోవాల్సి వస్తుంది అతని భార్య, ఇరుగమ్మ పొరుగమ్మ దగ్గర గిన్నెల్తో అరువు అందుకొని సంసారం నెట్టుకొస్తుంది తండ్రి భీకరాకారం చూసి పిల్లలు కూడా దగ్గరకు రావడానికి భయపడుతారు

నిన్న నెల్లూరుకు వెళ్ళానోయ్ రాజారావ్ మీ దూరపు బంధువు సన్యాసిరావు కనిపించి ఇరవై ఎనిమిదో తేదీ ఇక్కడకు వస్తున్నట్లు చెప్పమన్నాడు సెక్రటేరియట్‌లో ఏదో పనుందట" అన్నాడనుకోండి పక్కింటి పెద్ద మనిషి

"అరెరె మేము ఈ వారమంతా మా అత్తగారి ఊరికి వెళుతున్నామే నెలాఖరు వరకు రాము ఆ విషయం వ్రాస్తాను అంటూ ఆ విషయం వ్రాసేంత వరకు రాజారావుకు తృప్తి ఉండదు

ఏమండీ ఈ రోజు సినిమాకు పోదామండీ చాల మంచి సినిమా అట "

"ఇప్పుడు లేదులే ఏమలా ఒకటవ తేదీ తరువాత పోదాం

ఈ రోజుతో సినిమా అఖరుట పిల్లలు ఊరుకోవడం లేదు

నన్నేం చెయ్యమంటావు ఇప్పుడు దబ్బెక్కడిది

ఏమో నాకేం తెలుసు మూతి ముడుచుకొంటుంది

బర్త ఆఫీసుకు వెళ్ళేంత వరకూ రుసరుస లాడుతూనే ఉంటుంది మద్యాహ్నం భోజనాని కొచ్చినా పలుకదు పిల్లలు కూడా తండ్రి వైపు కోపంగా చూస్తారు తప్పనిసరి పరిస్థితుల్లో ఆరోజు సినిమాకు తీసుకు పోతాడు ।

రాజారావు రిక్షా ప్రసక్తే ఎత్తడు బార్య కూడా అతనికి బయపడి మాట్లాడదు సిటీ బస్సు పట్టుకొని సెంటర్లో దిగి అక్కడనుంచి నడచి పోతారు ఎంత దూరమైనా

గలగల మాట్లాడే రాజారావు ఈ వారమంతా ఏదో పోగొట్టుకున్నవాడిలా దిగులుగా ఉంటాడు ఒక వైపు పైల్సూ, ఇంకో వైపు కేలిండరూ ఉంటాయి ఒకటవ తేదీకి రోజులు లెక్కపెడుతూ ఉంటాడు

"చాల దిగులుగా కనిపిస్తున్నారు ఏవైనా అవాంఛనీయ సంఘటనలు జరిగాయా అంటుంది టైపిస్టు సుమతి

ఏం చెప్పడానికి తోచక "అవును మా దూరపు బంధు వొకాయన పోయాడు" అన్నాడు

ప్రతిసారీ అలా చెప్పలేదు కదా, ఒకసారి భార్యకు బాగు లేదని, ఇంకోసారి తల్లికి బాగులేదని ఇలా రక రకాలుగా చెప్పి తప్పించుకొంటూంటాడు పంక్చరయిన సైకిలు ట్యూబుకు ఎంత గాలి కొట్టినా నిలువనట్లు, అతను తెచ్చే చిల్లర అప్పులు ఏ మూలకూ చాలవు

* * *

మార్కెట్‌కు వెళ్ళి ఏదో కొన్నాడనిపించి ఇంటి వైపు నడక సాగించాడు అదే నెల మొదటి రోజుల్లో అయితే కూరగాయలు సంచి నిండుగా వేసుకొని ఈల వేసుకొంటూ ఇంటికి వచ్చేవాడు

గత నెల జీవితపు జ్ఞాపకాలు అతన్ని వెన్నాడుతున్నాయి ఇక నుంచి జీతాన్ని నాలుగు బాగాలుగా విబజించి నెలంతా ఒకే విదంగా గడపాలని దారిలో నిర్ణయించుకొన్నాడు

రాజారావు కూరగాయల సంచీ ఇంట్లో పెట్టి సైకిలు తీసుకొని ఆఫీసుకు బయలుదేరాడు ఆరోజు నెలాఖరు ముప్పైవ తేదీ ఈరోజు గడిస్తే రేపు జీతం వచ్చేస్తుంది నెలలో ఆఖరు రోజు జీతం ఇవ్వమని గవర్నమెంటు ఎప్పుడో జి వో ఇష్యూ చేసింది కాని తమ జీతాల బిల్లులు హెడ్ ఆఫీసులో పాస్ అయి చెక్కు రావాలి అందువలన తమ జీతం ఒకటవ తేదీ వస్తుంది

రాజారావు మెల్లగా ఆఫీసులో ప్రవేశించాడు ఏమోయ్ బిల్లులు పాసయ్యాయట్రా" కొలీగ్ మోహనరావుని అడిగాడు

"ఆ డైరెక్టరుగారు బిల్లులమీద సంతకాలు



చేసేదట చెక్కు సాయంత్రానికల్లా వచ్చేస్తుంది "

"హమ్మయ్య చల్లని మాట చెప్పావు" అన్నాడు రాజారావు

"అవున్నా మంత్ ఎండింగ్‌కదా డబ్బులకు కటకటగా ఉంది"

రాజారావు ఫైల్సు ముందేసుకొని కూర్చున్నాడే గాని అతని మనసంతా నిముషాల్ని, గంటల్ని లెఖ్ఖపెడుతూ ఉంది ఇంకా ఇరవై నాలుగు గంటలు ఎప్పటికి గడస్తాయా, ఎప్పుడు జీతం చేతిలో పడుతుందా అని ఆలోచిస్తున్నాడు సరిగ్గా సాయంత్రం మూడు గంటలకు స్పెషలు మెసెంజరు ద్వారా జీతాల తాలూకు చెక్కు పంపాడు డైరెక్టరు రాజారావుకు ఈ వార్త ఏడు గుర్రాల రథం మీద స్వారి చేసినట్లుంది ఈ ఒక్క రాత్రి గడిస్తే చాలు అనుకొంటున్నాడు ఆ రాత్రే భార్యతో మాట్లాడి ఒక నిర్ణయానికి వచ్చాడు జాగ్రత్తగా జీతాన్ని వాడుతూ నెలాఖరు వరకు వర్రీ లేకుండా బ్రతకాలని

మరుసటి రోజు గంట ముందుగా ఆఫీసుకు బయలు దేరాడు ఆఫీసులో ఆ రోజు అతను ప్రతి క్షణాన్ని ఆనందంగా గడిపేస్తున్నాడు కొత్త కొత్త జోకులతో ఆఫీసునంతా నవ్విస్తున్నాడు ఎస్టాబ్లిష్‌మెంటు క్లర్కుని దగ్గరుండి బాంకుకి పంపించాడు. అతనికి సాయంగా మేనేజరు ఒకడ్ని పంపిస్తుంటే, ఇద్దరుండడం మంచిది సార్ అంటూ రెకమెండ్ చేసి ఇంకో ప్యూను కూడా వెళ్ళే ఏర్పాటు చేసాడు ఆఫీసు కాష్ జాగ్రత్తగా తెమ్మని మరీ మరీ సలహా ఇచ్చాడు

గది గుమ్మంలో అడుగుల చప్పుడయితే తల తిప్పి చూస్తున్నాడు మేనేజరు ఫైల్లో తప్పులు వెతికి తిట్టడానికి పిలిస్తే, జీతం తీసుకు వెళ్ళమని పిలుస్తున్నట్టు ఫీలవుతున్నాడు

సమయం దాదాపు మధ్యాహ్నం ఒంటి గంట అవుతుందనగా హడావుడిగా వచ్చాడు ప్యూను శంకరయ్య

ప్యూనును కౌగలించుకొన్నంత పని చేసి నాయనా శంకరయ్యా మన వాళ్ళు డబ్బు తీసుకొని వస్తున్నారా అడిగాడు ఎంతో అప్యాయంగా

సార్ కొంప మునిగింది ముందు మన మేనేజరుగారెక్కడో చెప్పండి వగరుస్తూ అన్నాడు శంకరయ్య

ఆయన యూరినల్సుకు వెళ్ళాడు ఇప్పుడే వస్తాడు గాని, ఏం జరిగిందో చెప్పు

ఈలోపల ఆఫీసు వాళ్ళంతా శంకరయ్య కంగారుతో కూడిన ముఖ కవళికలు చూసి భయపడ్డారు

ఏం జరిగిందో చెప్పు చెప్పు అంటూ తొందర చేసారంతా

"ఏం చెప్పమంటారు సార్ డబ్బు డ్రా చేసి బాగ్‌లో పెట్టుకొని వస్తున్నాం సార్ బాంకు దాటామో లేదో నలుగురు రౌడీలు మోహనరావుగారి చేతిలోని బాగ్ లాక్కొని పరుగెత్తి పక్క సందులో మాయమైపోయారు మోహనరావుగారూ, ఆశీర్వాదమూ కలసి



## మగాడు

వరకట్నపు
వంటకానికి
కన్నెను
కరివేపాకులా
కాల్చుకు తింటున్నాడు
అవసరం తీరాక
అవతల పారేస్తున్నాడు....!

—తాతినేని తులసీమోహన్

పోలీసు రిపోర్టు ఇవ్వడానికి వెళ్తే విషయం చెబుదామని నేనిలా వచ్చాను" అంటూ ఏడుపు ముఖం పెట్టాడు శంకరయ్య.

అంతా దిగ్భ్రమ చెందారు. "ఈనెలకు ఇంకేమి జీతం వస్తుందిరో దేవుడో" అంటూ బావురుమన్నాడు రాజారావు.

అప్పుడే యూరినల్సుకు వెళ్ళి వచ్చిన మేనేజరు విషయం తెలియక సైక్లోనులో సర్వం కొట్టుకుపోయిన తుఫాను బాధితుడిలా ఏడుస్తున్న రాజారావును మొదట ఓదార్చి తరువాత విషయం గ్రహించాడు. వెంటనే హెడ్ ఆఫీసులో ఉన్న డైరెక్టరుగారికి ఫోను చేసి విషయం చెప్పాడు. తను శంకరయ్యను తీసుకొని పోలీసు స్టేషనుకు బయలుదేరి వెళ్ళాడు.

"అయ్యా మీ జీతాలు ఎక్కడికీ పోవు. ఓపికగా ఉంటే అర్థ రాత్రి అయినా సరే మీ జీతాలు మీకు బట్వాడా చేస్తాను" వెళ్ళేముందు దిగులు పడిన స్టాఫుకు హామీ ఇచ్చి మరీ వెళ్ళాడు.

రాజారావు ఆ హామీని నమ్ముకొని ఆఫీసులోనే ఉండిపోయాడు అతనిలో ఆత్మ విమర్శ మొదలయింది ఒక నెల జీతం రాకపోతే తన పరిస్థితి ఏమిటి? రోడ్డుమీద బిచ్చగాడికి, తనకూ తేడా ఏమిటి? సంఘంలో తన విలువ ఎంత దిగజారి పోతుంది అప్పుడు గుర్తు కొచ్చింది అతనికి పొదుపు యొక్క ఆవశ్యకత ఇక నుంచి కొన్ని ఖర్చులు మానుకొని అయినా నెలకు వంద రూపాయలు పొదుపు చేయాలి అనుకొన్నాడు

రాజారావు అదృష్టం బాగుంది పోలీసులు దొంగల్ని పట్టుకొన్నారు. డబ్బుతో సహా దొంగిలించిన వారు పారిపోకుండా భయపడి ప్రక్కనే ఉన్న ఒక టీ బంకులో దూరారు పోలీసులు రోడ్డు మీద తిరుగుతూండడంతో వాళ్ళు ఎంత సేపటికి బయటికి పోరు దాంతో అనుమాన మొచ్చిన టీ బంకు ఓనరు ఆ విషయం పోలీసుల చెవిన వేశాడు

డబ్బు తెచ్చిన మేనేజరు రాజారావుతో బాటు కాసుకొని కూర్చొని ఉన్న విశ్వనాథం, రామచంద్రయ్యలకు జీతం ఇచ్చాడు అర్థ రాత్రి రాజారావు ఆటోలో ఇంటికి వెళ్ళి భార్యకు జరిగిందంతా వివరించాడు

సారీ విమలా టైమ్ లేక ఏమీ తేలేక పోయాను రేపు పిల్లలకు స్వీట్సు తెస్తాను పిక్చరుకు కూడా రిజర్వేషను చేయిస్తాను" అంటున్న భర్త నోరు మూసింది విమల

నిన్న మీరే చెప్పారుగా పొదుపు చెయ్యాలని ఇకనుంచి నెలకు ఒక్కసారే మన సినిమా ప్రోగ్రాం "

"అలాగే అంటూ అప్పటికి బెడ్ మీద వాలాడు

'దేవుడా ఆయన మనసు ఇకనయినా మార్చు ఈ సంఘటన మా జీవితాలకు గుణ పాఠం కావాలి అని దేవుణ్ణి కోరుకుంది విమల 

ఇటీవల అవనిగడ్డలో 'రాష్ట్రస్థాయి' కార్టూన్ ఎగ్జిబిషన్ జరిగింది ఈ ప్రదర్శనలో 30 మంది కార్టూనిస్టులు పాల్గొన్నారు. ప్రదర్శించిన 170 కార్టూన్లను సుమారు 5000 మంది ప్రేక్షకులు తిలకించారు ఈ సందర్భంగా ఆర్గనైజింగ్ కార్టూనిస్టు శ్రీ డి. ఎల్. ఎన్. శాస్త్రి, కార్టూనిస్టులు శ్రీ డి వి కృష్ణమోహన్, శ్రీ కె వేణు, శ్రీ లక్ష్మణబాబు, శ్రీ కె. గోపాలకృష్ణలని చిత్రంలో చూడవచ్చు



# హైదరాబాద్ నోట్‌బుక్

## అన్నమాచార్య భావనావాహిని :

అన్నమాచార్యుడు సంకీర్తనాచార్యుడు తన కీర్తనలను ఆయన దివ్య ప్రబంధంతో పోల్చాడు తిరుమలలో నిత్య కైంకర్యానికి ఆయా వేళలలో ఆ కీర్తనలు పాడే సంప్రదాయమూ ఏర్పాటు చేశాడు సాదు సుబ్రహ్మణ్యంగారు, వేటూరి ప్రబాకర శాస్త్రి గారు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు కీర్తనల వ్యాప్తికి తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యాన చాల కృషి చేశారు తర్వాత దేవస్థానం అన్నమాచార్య ప్రాజెక్టు ఏర్పాటు చేసింది శ్రీమతి శోభారాజు దశాబ్దంగా అన్నమయ్య కీర్తనలను ప్రచారం చేస్తున్నారు ఆమె స్వతంత్రంగా ఇప్పుడు త్యాగరాజ గాన సబలో అక్టోబర్ 7 వ తేదీన తత్కీర్తనల వ్యాప్తికోసం అన్నమాచార్య బావనా వాహిని అనే పేరుతో ఒక సంస్థను స్థాపించారు దానికి రాష్ట్ర దేవాదాయ దర్మాదాయ కమిషనర్ శ్రీ లక్ష్మీనారాయణ ప్రారంబోత్సవం జరిపారు ముఖ్యాతిదిగా విచ్చేసిన సమాచార సాంస్కృతిక శాఖ కమిషనర్ శ్రీ ఏ వి ఆర్ కె ప్రసాద్ ప్రసంగిస్తూ తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమాచార్య ప్రాజెక్టులో అనుబవం పొందిన శ్రీమతి శోబారాజు కీర్తనలను నేర్పడంలో కృతార్థురాలు కాగలరని అన్నారు సమావేశానికి ఆహార వ్యవసాయ శాఖా కార్యదర్శి శ్రీ ఎం గోపాలకృష్ణ అద్యక్షత వహించారు నాగార్జున స్టీల్స్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ కె వి కె రాజు దక్షిణ మద్య రైల్వే ప్రదాన పౌర సంబందాదికారి శ్రీ సి రామకృష్ణ ఆంధ్రప్రబ సంపాదకులు శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసర్ డాక్టర్ వేటూరి ఆనందమూర్తి అన్నమాచార్య కీర్తనల సాహిత్య సంగీత వైబవాన్ని వివరించారు చివరన శ్రీమతి శోబరాజు బృందం అన్నమాచార్య కీర్తనలను శ్రావ్యంగా పాడి శ్రోతలను ఆనందపరచింది

## మోహకమైన మోహిన్ ఆట్టం :

సౌత్ ఇండియన్ కల్చర్ అసోసియేషన్ రజతోత్సవం 5వ నాడు అక్టోబర్ 15న రవీంద్రబారతిలో బారతీ శివాజీ ప్రదర్శించిన మోహిని ఆట్టం ప్రేక్షకుల మనస్సును మోహింపజేసింది మోహినీ ఆట్టం పూర్తిగా కేరళ నాట్యం కదక్కళిని పురుషులే నిర్వహిస్తే మోహినీ ఆట్టాన్ని స్త్రీలే నిర్వహిస్తారు పేరుకు తగినట్టుగా మోహిని ఆట్టం అన్ని విదాల మనో రంజకంగా ఉంటుంది బరత నాట్యంలో నిష్ణాతురాలైన బారత శివాజి మోహిని ఆట్టంలోను తన నైపుణ్యాన్ని చూపింది ఉణ్ణి గణపతి అనే ప్రార్థనతో నాట్యం ప్రారంబమైంది ఎదప బారతి అబినయానికి విశేషావకాశం గల చొల్‌కట్టు ముఖచ్ఛందంలను అబినయించి అష్టపదిని శంకరాచార్యుల సౌందర్యలహరి శ్లోకాన్ని చివరన మోహిని ఆట్టానికి జీవగర్ర అయిన పందాట్టం (బంతి ఆట)ను అద్భుతంగా అబినయించింది సాదారణంగా బంతి ఆటలో అంగ విన్యాసానికి ఎంత అవకాశం వుంటుందో మనకు తెలుసు అది స్త్రీలు ఆడేదయితే మరీ ఆకర్షకంగా వుంటుంది తాళలయాలతో ఆడే బంతి ఆట రామణీయకం చెప్పాలా?

**శ్రీమతి శోభారాజు స్థాపించిన అన్నమాచార్య భావనావాహిని ప్రారంభోత్సవ సందర్భంగా తీసిన చిత్రం**




## రాజస్తానీ చిత్ర పద్రర్శనం :

కళాబవన్‌లో అక్టోబర్ 11 నుంచి 14 వరకు వున్న రాజస్థానీ చిత్ర కళా ప్రదర్శనం వైవిద్య విలసనంతో కన్నుల విందుగా వుంది దీనిలో అవార్డులు పొందిన రాజస్థానీ కళాకారుల వర్ణ చిత్రాలు, డ్రాయింగులు, శిల్పాలు వున్నాయి శ్రీయుతులు సుబాష్ మెహతా కన్హయ్యలాల్ వర్మ అబ్దుల్ కరీం ఆర్ బి గౌతమ్ శైలేంద్ర బట్ నాగర్ మోహన్ శర్మ కళా ఖండాలు విశిష్టమైనవి శాంతి నికేతనంలో శిక్షితుడైన అశీతి వర్ష వృద్ధుడు శ్రీ రామగోపాల్ విజయవర్గీయ ప్రాచీన సంప్రదాయ రీతిలో రచించిన రెండు వర్ణ చిత్రాలు సుందరంగా వున్నాయి ఈ ప్రదర్శనం సంచార ప్రదర్శనం గాజు కిటికీలున్న పెద్ద టూరిస్టు బస్సులో కళాఖండాలను ఒకచోట నుంచి మరొక చోటికి తీసుకొని వెళ్లుతున్నారు ఆ బస్సులోనే 30దాకా చిత్రాలు ప్రదర్శించవచ్చు కిటికీలలో మరి 50 60 చిత్రాలను లోపల ప్రదర్శించవచ్చు ఈ బస్సుకు స్వంత జనరేటరు కూడ వుంది రాజస్థాన్ లలిత్ కళా అకాడెమీ రజతోత్సవ సందర్భంలో ఈ బస్సును అకాడెమీకి ఆ రాష్ట్ర ప్రభుత్వం బహూకరించిందట ఇది మారుమూల గ్రామ సీమలకు పయనిస్తుంది గ్రామీణులలో ఈ సంచార ప్రదర్శనం ఎంతో కళాసక్తిని కలిగించిందని కార్యదర్శి శ్రీ బిపిన్ బిహార్ సక్సేనా తెలిపారు ఇలాటి పనిని ప్రతి రాష్ట్ర లలిత కళా అకాడెమీ చేస్తే ప్రజలలో వుత్తమ కళాబిరుచి కలుగుతుంది నిజానికి పట్టణాలలోకన్నా పల్లెలలోనే మనం మన ప్రాచీన కళా సంపదను ప్రజలకు తెలిపి కళా సంస్కృతుల పట్ల వారికి గౌరవాదరాలు కలిగించడం అవసరం

### ఉపశ్రుతి :

రచన కూడ చేతి పనే గనుక రచయితలకు కూడ హస్త కళాకారులకు ఇచ్చే సౌకర్యాలు ఇవ్వాలని మనం కోరితే ఎలా ఉంటుంది?- అని ప్రశ్నించారు మిత్రులు శ్రీ నిడుదవోలు సుదరేశ్వరరావు రచన చేతి పని కాదు మెదడుతో తయారయ్యేదని అంటారే- అని నీళ్లు నమిలాను చేయి నొప్పెట్టేట్టు వ్రాస్తుంటే మెదడు పని అంటారేమిటి?- అనడిగారు మరొకరు రచన చేతి పని అని ప్రభుత్వం గుర్తింపు పొందడానికి ఉద్యమం ఆరంబిద్దాం- అన్నాడొక విప్లవ కవి

—తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna, Phones P B X 61247, 61248 & 75667*

# ఉచిత కానుక!

# గ్లూకోన్-డి ® యొక్క తక్షణ శక్తితోపాటుగా




# ఆకర్షణీయమైన స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా ఒకటి.

తక్షణ శక్తినిచ్చే మీ దినసరి పానీయం. దాన్ని కలుపుకోడానికొక చక్కని సాధనం.

ఈ తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా గ్లూకోన్-డి 400 గ్రా. ప్యాక్‌తో పూర్తిగా ఉచితం.

తాజాదనాన్ని, చల్లగా శక్తినీ ఇచ్చే గ్లూకోన్-డి విటమిన్ డి, కాల్షియం, ఫాస్ఫరస్‌లతో బలపరచబడినది. దాన్ని అలాగే తీసుకోండి, లేదా పళ్లరసం, పాలు, తేనీరు, కాఫీ, లేదా మంచినీళ్లలో కలిపి తీసుకోండి.

అయితే ఒక్కటి! దాన్ని గ్లూకోన్-డి ప్రత్యేక కానుక చెమ్చాతో మట్టుకు కలిపి తీసుకోండి!

HTB-GLL-9686







స్టాకు పరిమితం, నిర్ణీత స్థలాలలో మాత్రమే లభ్యం.

తక్షణ శక్తి కోసం-గ్లూకోన్-డి ®

మంచి ఆరోగ్యానికి మూలస్థానం గ్లాక్సో

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA